

# తలలో ముడుచుకున్నట్టే మీ శరీరాన్ని అలంకరించుకోడానికి రంగు రంగుల పువ్వుల గుత్తులు...

మీ శరీరాన్ని పువ్వులతో అలంకరించుకోవడంలో ఆకర్షణీయంగా అందాలనిచ్చే ఎంపికైన పువ్వుల విన్యాసంతో క్రొత్త తరహా మెట్టూర్ ప్రింటులను ప్రవేశపెడుతున్నారు.

కని విని ఎరుగని అప్పుడే వికసించిన మనోహరమైన పువ్వులవర్ణ విలాసము పసుపువన్నెని చామంతులు, పరవశపరచే చంపకాలు, సొగసుగా వికసించిన ఎఱ్ఱ గులాబీలు కంటికి ఇంపైన వంగపుఛాయ పువ్వులు.

కనకాంబరాలు, పారిజాతాలు ఇంకా ఎన్నెన్నో... ప్రత్యేకంగా తయారైన మెట్టూర్ ప్రింటులు అలాగే ఉపయోగించవచ్చు లేకపోతే సూపర్ ఫైన్ మెట్టూర్ పాప్లిన్‌లతో జోడించి వాడుకోవచ్చు.

అంతేగాకుండా అందరికీ మెట్టూర్ ప్రింటులు మరియు మెట్టూర్ పాప్లినులు ఎంతో మన్నికైనవి... రంగు వెలవని మీ క్రొత్త క్రొత్త రకాలు ఒక్కసారి వచ్చి చూడండి.

## మెట్టూర్ ప్రింటులు, పాప్లినలు



మీరు అభిమానించే
మెట్టూర్ మిల్లులు, లాంగ్‌క్లాత్
తయారుచేసేవారే వీటిని తయారుచేస్తున్నారు.



OBM 6471 TG

# లోకంపోకడ










**ఆంధ్రసచిత్రవారపత్రిక**

వ్యవస్థాపకులు :
దేశోద్ధారక కాశీనాథుని
నాగేశ్వరరావు పంతులుగారు
స్థాపితం : 1908

శివలెంక శంభుప్రసాద్
సంపాదకుడు :
[1938—1972]

శుక్రవారం : 12-12-'80
రౌద్రినామ సం. మార్గశిర శు. పంచమి
**సంపుటము 74 : సంచిక 13**

సంపాదకుడు :
శివలెంక రాధాకృష్ణ

*

పోస్ట్‌లో ఏడాది చందా రు. 54-60
ఆరు మాసాల చందా రు. 27-30
విడి ప్రతి వెల ఒక రూపాయి
**ఆంధ్రపత్రిక కార్యాలయము**
గాంధీనగరం, విజయవాడ–520 003

## విషయానుక్రమణిక

# రాగలహరి

శ్రీమతి మాధవపెద్ది పుణ్యశీలాప్రసాద్

"పల్లవీ....పల్లవీ...." వస్తూనే బూట్లైనా విప్పకుండా పిలిచాడు చరణ్.

పల్లవి పలకలేదు.

సరాసరి లోపలికి వచ్చాడు.

మంచం మీద నీరసంగా పడుకొని వుంది పల్లవి. వళ్లంతా చెమట పట్టి వుంది. వెంట్రుకలు నుదుటికి అతుక్కునివున్నాయి. చెమటకి తడిసి.

"ఏమిటిది పల్లవీ-ఎందుకిట్లా వున్నావు ?.... ఏమైంది? .... చెప్పు... చెప్పు..." భుజాలు పట్టి మొహం మీదికి వంగుతూ అడిగాడు చరణ్.

"ఏంలేదు. అదిగో ఫ్లాస్కులో కాఫీ వుంది. ముందు మీరు కాఫీ తాగండి. ఈ పూటకి నేను లేవలేను. కాళ్లు తేలిపోతున్నాయి. వంట మీరే చెయ్యాలి." నీరసంగా నవ్వింది పల్లవి.

"వంటా కాఫీ సంగతి సరే, నీకేమైంది చెప్పు ముందు"

పక్కనే కూర్చున్నాడు చరణ్, భార్య భుజం మీద చెయ్యేసి.

"చెప్తాగా. ముందు కాఫీ తాగండి."

"అబ్బా..." విసుగ్గా లేచాడు చరణ్. బూట్లు, సాక్సు విప్పి, మంచం కిందకితోసి, లోపలికి వెళ్ళాడు. కాళ్లూ, చేతులూ, మొహం కడుక్కుని, తుడుచుకుంటూ గది లోకి వచ్చాడు. "పల్లవీ! నువ్వు పొద్దున గూడా భోజనం చెయ్యలేదా?" అడిగాడు.

"అబ్బ! అన్నీ సొంటు కొడుస్తారు నాకు తినబుద్ధి కాలేదు, తినలేదు."



"అదే! ఎందుకని?"

"ఏమో...!"

లేచి కూచుంది పల్లవి. కాఫీ గ్లాసులో పోశాడు చరణ్.

"నాకు వద్దండీ ఆ వాసనంటేనే కడుపులో తిప్పుతోంది" అంటూ వుండగానే వాంతి అయిపోయింది.



చరణ్ కంగారుపడుతూ ఆమె తల పట్టుకున్నాడు.

"లింగమ్మా.. లింగమ్మా..." గట్టిగా పిలిచాడు. అప్పుడే నాటిట్లోంచి వస్తున్న లింగమ్మ, పరుగున లోపలికి వచ్చింది.

"అమ్మగారికి వాంతి అవుతోంది. కాసిని నీళ్లు తీసుకురా!"

లింగమ్మ పరుగెత్తి చెంబుతో నీళ్లు తెచ్చింది

పల్లవి ముఖమూ – నోరూ స్వయంగా కడిగాడు చరణ్

తోటకూర కాడలాగా వాలిపోతున్న భార్యని పరుపు మీద పడుకోబెట్టి, లింగమ్మతో "లింగమ్మా! నువ్వు ఇదంతా శుభ్రంచేసి డాక్టరుగారిని పిల్చుకురా? వద్దులే, నేను పిల్చుకొస్తాను నువ్వు అమ్మగారిని చూసు కుంటూ వుండు." అంటూనే చెప్పులైనా వేసుకోకుండా బయటికి పరుగెత్తాడు చరణ్.

లింగమ్మ శుభ్రం చెయ్యడం ప్రారంభించింది.

నీరసంగా కళ్ళు విప్పిన పల్లవి, కాఫీ గ్లాసులని చూసి "అయ్యగారు లేరా లింగమ్మా" అని అడిగింది.

"లేరమ్మా! డాక్టరుగారికోసం ఎళ్లారు" అంది లింగమ్మ.

"అయ్యో, కాఫీ తాగనేలేదే" అంది నొచ్చుకుంటూ పల్లవి.

మరో పావుగంటా ఇరవై నిమిషాలకి డాక్టరుగారితో వచ్చాడు చరణ్

"మా పెళ్ళయి అయిదేళ్ళు దాటుతోంది డాక్టర్! ఈ అయిదేళ్లలోనూ మా పల్లవి ఈ విధంగా అనారోగ్యంగా ఎప్పుడూ లేదు. ఏవన్నా వస్తే నాకే కానీ, ఆమె కెప్పుడూ ఏదీ రాలేదు. అందుకే నాకు కాస్త కంగారుగా వుంది."

"మరేం భయపడకండి వట్టి వాంతులేనా? ఏదన్నా పడని వస్తువు తింటేనూ, అజీర్ణంవల్లనూ కూడా వాంతులు కావచ్చు" డాక్టరుగారు పల్లవి పడుకున్న మంచం దగ్గిరికి వస్తూ అన్నారు

"ఏమిటి మిస్టర్ చరణ్.. అన్నారు? ఆవిడకి ఎప్పుడూ ఏవీ రాలేదా? ఆడవాళ్ళకి ఓర్పు ఎక్కువండీ... చిన్న చిన్న వాటిని లెక్కచెయ్యరు..." నవ్వుతూ క్షుణ్ణంగా పరీక్ష చేశాడు.

"ఫరవాలేదు. ఈ టాబ్లెట్సు వాడండి. వాంతులు కడతాయి. తినాలనిపిస్తే తప్ప ఏదీ తినకండి. ఈ 'ఎలక్ట్రాల్' పౌడరు నీళ్ళలో కలిపి తాగుతూ వుండండి ఫ్రూట్ జ్యూస్ తీసుకోండి." లేచారు డాక్టరుగారు.

"డోంట్ వర్రీ మిస్టర్ చరణ్. ఏం భయంలేదు. ఒక్కసారి లేడీ డాక్టరు చేత చెకప్ చేయించండి... ఎందుకైనా మంచిది. నాకు తెలిసిన మంచి గైనకాలజిస్టు ఒకావిడ వుంది. ఆవిడ దగ్గిరికి వెళ్ళండి."

డాక్టర్ని పంపి లోపలికి వచ్చిన చరణ్ని అడిగింది పల్లవి—

"ఏమన్నారు?"

"ముందు టాబ్లెట్ వేసుకో. ఆనక యిది తాగు చెబుతాను."

బుద్ధిమంతురాలిలాగా అతడు చెప్పింది చేసింది పల్లవి

"ఆఁ ఇప్పుడు చెప్పండి, ఆయన ఏమన్నారో..."

"లేడీ డాక్టరుకి కూడా చూపించమన్నారు." కాసేపు ఏమీ మాటాడలేదు పల్లవి.

"ఇంకేమన్నా బాధ వుందా పల్లూ?" తల నిమురుతూ అడిగాడు చరణ్

"లేదండీ. కానీ నాకూ అదే అనుమానంగా వుంది."

"ఏదీ?"

"అదే, లేడీ డాక్టరుకి చూపిద్దాం అని!"

"ఎందుకు?"

"ఎందుకో అర్థం కాలేదా?" నవ్వింది సిగ్గుగా!

చరణ్ కళ్ళు తళుక్కుమన్నాయి!



"అయిదేళ్ళకి...సరిగ్గా అయిదేళ్ళ తరువాత దేవుడు కరుణిస్తున్నాడా!" భర్తనే చూస్తూండి పోయింది పల్లవి.

## 2

మంద మందంగా గాలి వీస్తోంది. ఎండ వేడిమికి కలిగిన తాపాన్ని తొలగించి సేద తీరుస్తోంది. సూర్యకిరణాల తీవ్రత, తీక్ష్ణత కొద్ది కొద్దిగా తగ్గుతోంది. సంధ్యాలక్ష్మికి లొంగిపోతున్నాడు సూర్యభగవానుడు.

సంధ్యాలక్ష్మి సూర్యనారాయణుని లొంగ దీసుకున్న విజయగర్వంతో అప్పుడే వస్తున్న చీకటి కన్యను చూస్తోంది తిరస్కారంగా!

కించిత్ చిన్నబోయినా, చీకటి కన్య తనకు తోడైన చంద్రుణ్ణి చూసి ధైర్యం తెచ్చుకుంది. చిఱునవ్వు నవ్వింది.

"చీకటి—వెలుగుల సంగమం అపూర్వం" అన్నాడు చరణ్.

"అవునండీ. ఎంత అందంగా వుందీ సాయంత్రం!" అంది పల్లవి.

తెల్లని జరీ బార్డరు వున్న చీర, తెల్ల జాకెట్టు వేసుకుని పవిత్రంగా కనబడుతోంది చరణ్ కళ్ళకి పల్లవి.

"ఇవాళ మన మనసులూ ఆనందంగా వున్నాయి. అందుకే ఏది చూసినా అందంగా, అద్భుతంగా కనిపిస్తోంది" అన్నాడు చరణ్.

"అవునా? ఎందుకబ్బా అంత ఆనందం, ఈ మనసులకి?" కను రెప్పలు తాటిస్తూ కొంటెగా అడిగింది పల్లవి.

"ఎందుకో నీకు తెలీదూ? దొంగా..." గడ్డం పట్టి ఆడిస్తూ గలగలా నవ్వాడు చరణ్.

"అబ్బ... నిజం పల్లూ... నా కెంత సంతోషంగా వుందో తెలుసా? మన వివాహ జీవితం సార్థకం కాబోతోంది. ఫల ప్రదం కాబోతోంది" అన్నాడు చరణ్ తనే మళ్ళీ.

పల్లవి మాట్లాడలేదు. పెళ్ళయిన సంవత్సరం మొదలుకొని, తమ బంధువు లందరి దృష్టీ తమ మీదే!

"ఏమ్మా... ఇంకా ఏమీ విశేషమున్నట్లుగా లేదే... ఏం... జాగ్రత్త పడుతున్నారా?"

"ఇప్పటి వాళ్ళంతేలే తర్వాత ఈ స్వేచ్ఛ వుండదని."

"అయినా తొందరగా ముగించేసుకుంటే మంచిది. మళ్ళీ ఆ తరువాత ఓపికలుండవు గూడా!"

ఇటువంటి మాటలు విని నవ్వుకునేవాళ్ళు మొదట్లో పల్లవీ, చరణ్ గూడా!

రెండేళ్ళు గడిచాయి. అందరూ ఎక్కడికెళ్ళినా ఎగాదిగా చూడడం ప్రారంభించారు.

"డాక్టరుకి చూపించుకోగూడదూ? ఏవో ఆపరేషన్లు, అవీ వున్నాయిటగా — పిల్లలు పుట్టడానికి? ఈ రోజుల్లో లేనివేమున్నాయి?"

"ఏమో! ఎవరిలో ఏ లోపమో! ఇద్దరూ చూపించుకుంటె మంచిది."

ఈ వ్యాఖ్యానాలు విని ఏదోగా అయ్యేది పల్లవి మనసు. చరణ్ పట్టించుకునే వాడు కాదు.

మరో రెండేళ్ళు గడిచాయి. చరణ్‌ని చూసి అందరూ జాలిపడడం, సానుభూతి చూపించడం ప్రారంభించారు—

"పెళ్ళాం గొడ్రాలు, అయినా ఎంత ప్రేమగా చూసుకుంటాడో." "అంత మంచి వాళ్ళు ఈ రోజుల్లో అరుదే సుమా!"

"ఇంకొకడైతే... దానికింత పారేసి... వేరే దాన్ని చేసుకునేవాడు..."

"అవును. మగాడికేం... లక్షణంగా చేసుకోవచ్చు."

ఈ మాటలకి చరణ్‌కి బాగా కోపం వచ్చేది. వాళ్ళతో సాధ్యమయినంత వరకూ వాదించేవాడు.

పల్లవిని అందరూ ఎంతగానో అవమానించేవారు, బంధువుల్లో—

"పిల్లల్ని అవతలకి తీసుకెళ్ళండి, అదిగో ఆవిడొస్తోంది."

"ఇదిగో నిన్నే. ఎత్తుకుంటానంటుందేమో— ఇవ్వద్దు."

"ఆవిడ కెదురుగుండా పిల్లలకి అన్నం పెట్టద్దన్నానా?... గొడ్రాలు ఒక్క చూపు చాలు... పిల్ల అన్నం తినడమే మానేసింది, బొత్తిగా!"

"బాలింతరాళ్ళు అన్నం తింటుంటే గొడ్రాళ్ళు చూడగూడదు."

"అవతలికి పోవే... ఓపలేని దానివి...అది అసలే గొడ్రాలు. నిన్ను చూసి కాస్త కూస్త మనసులోనన్నా ఏడుపు లేకుండా వుంటుందా? గొడ్రాలుకేం తెలుస్తుంది, బిడ్డనొప్పి అసీ.."

ఈ విధంగా ఎక్కడికెళ్ళినా, గొడ్రాలు— గొడ్రాలు అనడంతో... ఎక్కడికన్నా వెళ్ళడమె మానుకుంది పల్లవి.

చాలా బాధ పడుతూ వుండేది పల్లవి. అయిదేళ్ళు తిరిగేసరికి గొడ్రాలు అన్న పేరు స్థిరపడి పోయింది పల్లవికి.

ఇన్నాళ్ళూ ఎవరో అనుకుంటున్నారులే అని కాసేపు బాధపడి వూరుకునేది. కానీ... కానీ... చరణ్ మనసులో కూడా ఆ బాధ వున్నదా? తమకి పిల్లలుండరేమోననే అనుమానం, భయం వుండేదా. దానివల్ల తనంటే జుగుప్స వుండేదా? ఏమో? అందుకే ఈ విషయం విని ఇంత ఆనందపడుతున్నాడేమో?

"ఏమిటి పల్లూ! మౌనంగా వుండిపోయావు? నీకు ఆనందంగా లేదూ? మనింట్లోగూడా చిన్నపాపాయి బోసినవ్వులూ, కేరింతలూ, చప్పట్లూ, తప్పటడుగులూ, ఏడుపులూ, అల్లర్లూ, లాలిపాటలూ, జోలపాటలూ, ఉయ్యాలా, ప్రాం... అన్నీ తల్చుకుంటే ఎంత మధురంగా వుంటుంది? కదూ? చెప్పు పల్లూ."



పల్లవి పలకలేదు. అట్లాగే చూస్తూండి పోయింది భర్త వంక.

"ఇన్నాళ్ళ జీవితం వేరు, ఇంక ముందు జీవితం వేరు. ఇన్నాళ్ళూ నాకు నువ్వు, నీకు నేను. కానీ ఇంకముందు, మనిద్దరికీ — ఇంకొకరు."

"అసలు పిల్లలు లేని జీవితం— జీవితం కాదు పల్లూ. పాపల పసిడి పలుకులు వినలేని జీవితమూ— ఒక జీవితమేనా? ఈ లోటు మనకిన్నాళ్ళూ తెలిసిరాలేదు కదూ? ఇప్పుడు తెలుస్తోంది."

"... ... ... ... ..."

"అసలు నా కెంత తొందరగా వుందో తెలుసా? ఇప్పుడే తొమ్మిది నెలలూ నిండి, ఆ పాపాయి త్వరగా వచ్చేస్తే ఎంత బావుండు అనిపిస్తోంది."

ఫక్కున నవ్వింది పల్లవి చరణ్ మాటలకి. పసిపాపకన్నా అమాయకంగావున్న అతడి నిర్మలమైన వదనం చూసి, మనసు లోని అనుమానాలన్నీ చెల్లాచెదరై పోయాయి. మనసు తేలికయింది పల్లవికి.

* * *

పల్లవిని వెక్కిరించిన వాళ్ళందరికీ, పల్లవి గర్భవతి అని ఉత్తరాలు రాసేస్తానన్నాడు చరణ్.

వద్దంది పల్లవి "ఏమోనండీ. గొడ్రాలుగా ముద్రపడిన నేను అంత తొందరగా తల్లినవగలనా! అని నాకే సందేహంగా వుంది!"

"ఛీ! అదేంమాట" అన్నాడు చరణ్.

"అవునండీ. తొమ్మిదినెలలూ గడిచి, బిడ్డ నెత్తుకున్నప్పటి మాట కదా. అప్పుడే రాద్దురుగానీ అందరికి! ఈ మధ్య ఏమన్నా జరిగినా అపహాస్యం పాలే కదా?"

"ఏమిటి పల్లవీ నీ మాటలు?" నిరాశ పడిపోతూ అన్నాడు చరణ్.

కళలేని నవ్వు నవ్వింది పల్లవి. చెంపలు పాలిపోయాయి, కళ్ళు లోతుకు పోయాయి. విపరీతమైన వేవిళ్ళుగా వున్నాయి ఆమెకి అసలేమీ తినలేకపోతోంది, తెగ నీరసంగా వుంటోంది. లేడీ డాక్టరుని అప్పుడే ఇంటికి పిలిపించి, పల్లవి తీసుకోవల్సిన జాగ్రత్తల గురించి చర్చించాడు చరణ్.

గాలీ, వెల్తురూ బాగావున్న గదిలోనే పల్లవిని ఎక్కువసేపు గడిపే ఏర్పాటు చేశాడు చరణ్. పాలూ, పళ్ళూ ఎక్కువగా స్వయంగా ఇవ్వడం మొదలుపెట్టాడు. విటమిను టాబ్లెట్లూ, టానిక్కులూ ఇస్తున్నాడు భార్యకి. ఆమె మనసు సంతోషంగా వుండడానికి రోజూ ఎక్కడికోఅక్కడికి తీసికెళ్తున్నాడు. మంచి మంచి పుస్తకాలు తెచ్చిచ్చాడు చదువుకోడానికి.

పొద్దునపూట ఎక్సర్‌సైజు బాగావుంటుందని తనే వాక్‌కి తీసికెళ్తున్నాడు కొంతదూరం. మధ్యాహ్నం పూట విశ్రాంతి తీసుకుని, నిద్ర పోయేట్టు చూస్తున్నాడు.

లేడీ డాక్టరుని 'అబార్షన్' జరగకుండా వుండడానికి తీసుకోవల్సిన జాగ్రత్తల గురించి కూడా అడిగాడు. ఆవిడ చెప్పింది— ఎక్కడికీ పరుగెత్తి వెళ్ళకూడదనీ, ఆ పరుగులో కాలు జారి పడితే ప్రమాదమనీ, ఒక్కోసారి అతి సంతోషమైన విషయమూ, అతి విచారకర విషయమూ గర్భిణీ స్త్రీలకు షాక్‌ను కలిగిస్తాయనీ.

అట్లాంటి సమయాల్లో ఒక్కొక్కప్పుడు 'గర్భస్రావం' జరగవచ్చు. ఇవేవీ కాకుండా ఒక్కొక్కప్పుడు, బలహీనత అనారోగ్యం వల్ల కూడా జరగచ్చు.

కాబట్టి అన్నివిధాలా జాగ్రత్తగా వుండడం ఎంతో అవసరం అని చెప్పిందావిడ.

## 3

అయిదో నెల గడుస్తోంది పల్లవికి. వేవిళ్ళు కాస్త తగ్గాయి. తిన్నవి కాస్త నిలుస్తున్నాయి.

బుగ్గల్లో నిగ్రదనం కనబడుతోంది. కళ్ళు కాంతివంత మవుతున్నాయి. శరీరంలో నిగారింపు వచ్చింది.

కంటికి రెప్పలాగా చూసుకుంటున్నాడు చరణ్.

"పల్లవీ, ఇవాళ సినిమా కెళ్దామా?"

"వద్దండీ, కాసేపు అట్లా తిరిగొచ్చి మన తోటలోనే కబుర్లు చెప్పుకుందాం."

చిలకాకు పచ్చని టెరీన్ చీర కట్టుకుంది పల్లవి. దానికి మాచైన బ్లౌజూ, నగలూ కూడా వేసుకుంది. కాసేపు షికారుగా వెళ్లి తిరిగొచ్చారు.

భోజనాల ఏర్పాటు చేసింది పల్లవి.

ఆరోజు పౌర్ణమి కావటంతో తోటంతా వెన్నెల పరుచుకుంది. వండిన వంటలూ తోటలోకి చేర్చారు ఇద్దరూ కలిసి. రెండు కుర్చీలు, ఒక బల్ల వేసుకుని భోజనానికి కూర్చున్నారు. వెన్నెలలో తోటంతా మెరుస్తోంది. మెల్లగా వీస్తున్న పిల్లగాలికి పరవశించి మల్లెలు, జాజులు సువాసనల్ని అందిస్తున్నాయి!

పొట్లకాయ పెరుగుపచ్చడి, బంగాళ దుంప వేపుడు, అప్పడాలు, కొబ్బరిపచ్చడి, ములక్కాడల పులుసు, గడ్డపెరుగు— ఒక్కొక్కటే వడ్డిస్తోంది పల్లవి.

"అబ్బ! ఎందుకిన్ని చేశావు పల్లూ? నీకు శ్రమ కాదూ? అసలెప్పుడుచేశావని ఇవన్నీ?"

"సాయంత్రమే చేసేశాను. శ్రమేమిటి? ఎవరికోసం చేశాను?"

"సరేగాని పల్లూ! మన పాపాయికి ఏం పేరు పెడదాం?" అప్పడం కొరుకుతూ అడిగాడు చరణ్.

"మీరు చెప్పండి."

"నువ్వే చెప్పాలి."



## జున్ను ఉండలు

కావలసినవి :— గోధుమపిండి — పావు కిలో. పాలు విరచిన జున్ను — పావు లీటరు, చక్కెర — ¼ కిలో, యాలకులు — 4, డాల్డా — ¼ కిలో.

చేసే పద్ధతి :— మైదాలో యాలకుల పొడి, జున్ను కొంచెం డాల్డా వేసి కలిపి అప్పడాల పిండిలా మర్దన చేయాలి. ఈ పిండిని చిన్న చిన్న గోలీలలా చేసి బాణలిలో (నూనె వేసి) డాల్డా వేసి, కాగిన తరువాత ఈ గోలీలు అందులో వేసి ఎరుపు రంగు వచ్చే వరకూ వేయించి వేరే తీసి ఉంచుకోవాలి. పంచదార గిన్నెలో వేసి ఉండపాకం రానిచ్చి ఈ ఉండలు అందులో వేసి బాగా తిప్పాలి. ఆరిన తరువాత పాకం బిగుసుకుంటుంది వీటిని తీసి తెల్ల డబ్బాలోగాని, సీసాలోగాని పోసుకోవాలి. వారం పది రోజులు నిలవ ఉంటాయి.

— మిసెస్ రావ్

## కైమా ఎగ్ కట్‌లెట్స్

కావలసినవి :— కైమా — పావుకేజి, గుడ్లు — 3, దాల్చిన చెక్క, లవంగం, వెల్లుల్లి — కొన్ని, పచ్చి కొబ్బరి — ఒక ముక్క, గసగసాలు — 1 స్పూన్, అల్లం — కొంచెం, కారం, పసుపు, ధనియాల పొడి, ఉప్పు - తగినంత

తయారుచేయు విధానము :— ముందు కైమా శుభ్రంగా కడిగి అందులో పైన చెప్పిన మసాలా దినుసులన్నీ వేసి (గుడ్లు తప్ప) మెత్తగా రుబ్బుకోవాలి. నీరు పోయకూడదు గట్టిగా వుండాలి. తరువాత స్టౌపై గిన్నె పెట్టి ఈ కైమాను చిన్న ఉండలుగా వేసి వేయాలి. కొంచెం సేపటికి కైమాలోని నీరు అంతా ఆవిరై పోతుంది. ఇప్పుడు గుడ్లు కొట్టి గిన్నెలో పోసి ఈ కైమా ఉండల్ని గుడ్ల సొనలో ముంచి నూనెలో కాని, నెయ్యిలోకాని వేయించుకోవాలి. బాగా వేగితే 2, 3 రోజులు చెడిపోవు.

— రమా ప్రభాకర



## వంటలు

## బఠాని పెసలు మిక్చరు

కావల్సినవి : పచ్చిబఠానీలు 1 కప్పు, పెసలు 1 కప్పు, కొబ్బరితురుము 3 చెమ్చాలు, జీలకర్ర 1 చెమ్చా, మినపప్పు 1 చెమ్చా, కరివేపాకు 2 రెమ్మలు, కారం 1 చెమ్చా.

తయారుచేయు విధానము : పెసలు, బఠానీలు విడివిడిగా నీళ్లలో ఒకరోజంతా నానబెట్టి ఉంచాలి. రెంటినీ నీళ్లనుంచి మర్నాడుతీసి పొడిగుడ్డలో పోసి మూటకట్టి ఒకరోజంతా అలానే ఉంచాలి. మూడోరోజుకి పెసలు మొలకలు వచ్చి ఉంటాయి. అప్పుడు బాణలిలో నాల్గు చెమ్చాల వనస్పతి వేసి మినపప్పు, జీలకర్ర, కరివేపాకు వేసి వేగాక పెసలు, బఠానీలు వేసి వస్తుని సెగపై మూత పెట్టకుండా గుల్లగా వేయించాలి. కొబ్బరి తురుము వలి మరికొంతసేపు వేయించి మెత్తని ఉప్పు, కారం వేసి కలియబెట్టాలి. సర్వ్‌చేసే ముందు ఈ మిక్చరులో యిష్టం ఉంటే వేయించిన అటుకులను కూడా కలుపుకోవచ్చును. 5, 6 రోజుల వరకూ నిలవ ఉంటుంది.

పల్లిశ్రీ నాగరాజ

---

క్షణం సిగ్గుపడి, తరువాత అంది పల్లవి— "నాకు అమ్మాయియితే... శ్రుతి అనిగానీ... కృతి అనిగాని పెట్టాలని వుందండీ !"

"శ్రుతి— కృతి... ఎంత అందమైన పేర్లు!... మరి అబ్బాయి అయితేనో?"

"అది మీరు చెప్పండి."

"సంగీత్ అనో... మోహన్ అనో... కళ్యాణ్ అనో... అయితే బావుంటుంది కదూ ?" అన్నాడు చరణ్.

"అవునండీ! నా మనసులోనివి మీకెట్లా తెలిశాయి? యాదృచ్ఛికంగా మన పేర్లు కలిశాయి. పల్లవి...చరణం అని. అట్లాగే మన పిల్లల పేర్లు గూడా మన పేర్లతో కలిసేలాగ మనం చేసుకుందాం. అది నా కోరిక."

"నాకు తెలుస్తోంది. అదేమరి నిజమైన ప్రేమంటే. వ.నిద్దరి ఆలోచనా రీతులు ఒకటే కదా?" అన్నాడు చరణ్

"ఏమిటి పల్లవీ అన్నమే తినడంలేదు?"

### రాగలహరి

మరోసారి పెరుగుపచ్చడి వేసుకోబోతూ అడిగాడు చరణ్.

"ఏమిటోనండి, కడుపు నిండిపోయింది. మనమీ కబుర్లు చెప్పుకుంటుంటే నాకు చాలా బావుంది. ఇంకేమీ తినబుద్ధి కావటం లేదు."

"అహ అట్లాకాదు, తినాల్సిందే! పులుసు ఎంత బావుందో, దాంట్లో అప్పడం నంచుకు తిను. ఎంత బావుంటుందో."

నోటికి అందిస్తూ అన్నాడు చరణ్.

"వద్దండీ నాకింక చాలు." లేచి వెళ్లి చెయ్యి కడుక్కుంది.

"ఇప్పుడే వస్తాను" అంటూ లోపలికి వెళ్లింది.

కాని ఎంతసేపటికి పల్లవి రాలేదు. అతను పెరుగన్నం తినడం కూడా అయిపోయింది. అప్పటికీ రాలేదు పల్లవి. "పడుకుందేమో" అనుకుంటూ గిన్నెలన్నీ చప్పుడు గాకుండా లోపల సర్దేశాడు. కుర్చీలు, బల్ల కూడా లోపల బెట్టి గదిలోకి వచ్చాడు.

పల్లవి పడుకొని వుంది. కాని నిద్ర పోలేదు. ఆమె మొహం ప్రశాంతంగా లేదు. ఏదో బాధని అణచుకున్నట్లుగా వుంది!

"పల్లూ... పడుకున్నావా?"

"ఊఁ!" అన్నది అటు తిరిగి పడుకుంటూ. ఉండి ఉండి కడుపుమీద చెయ్యివేసి నొక్కుకుంటోంది

అగలేపోయాడు చరణ్.

"ఏమన్నా బాధగా వుందా...?"

"అవునండీ! కడుపులో నొప్పిగా వుంది. డాక్టర్ని పిలుస్తారా..?" అంది అస్పష్టంగా.

వెంటనే వెళ్లాడు చరణ్. పదిహేను నిమిషాల్లో డాక్టర్ని వెంటబెట్టుకు వచ్చాడు. ఆవిడ పరీక్షచేసి ఇంజక్షన్ ఇచ్చింది.

"ఏమో! పల్లవి అప్పుడు బిడ్డ వెత్తుకునేదాకా నమ్మకం లేదా?" పలురకాలైన ఆలోచనలు—చరణ్ ఎదదులో !

(ఇంకా వుంది)

# 21 లక్షల క్రొత్త వ్యక్తులు గత సంవత్సరం డెట్ బిళ్లను వాడారు

# దీనికి ఒక ప్రబల కారణం వుంది – డెట్ యొక్క ఉజ్వలమైన ఉతుకు

ఇప్పుడు మునుపటికంటే ఎంతో ఎక్కువ మంది డెట్ బిళ్ల యొక్క ఉజ్వలమైన ఉతుకును ఇష్టపడుతున్నారు, వారంటారు; అది మిలమిల్ల తెలుపును, ఎంతో ఎక్కువ సొగసును ఇస్తుంది.

| ఉత్తమమైన రెండు డిటర్జెంట్ బిళ్లలు | |
|---|---|
| | క్రొత్త గ్రాహకులు |
| డెట్ బిళ్ల | 21,00,000 |
| రెండవ ఉత్తమ బిళ్ల | 14,00,000 |
| మొత్తము 49,00,000 క్రొత్త గ్రాహకులు | |
| మూలం: రిటైల్ స్టోర్ ఆడిట్ రిపోర్ట్: జనవరి–డిసెంబర్, 1979 | |
| వాడకపు ఆధారం: 1 బిళ్ల, ప్రతి నెల, ప్రతి వ్యక్తి | |

21,00,000 క్రొత్త వ్యక్తులు డెట్ బిళ్లను వాడటం మొదలెట్టారు

మరి మీరు?




## డెట్ బిళ్ల

వాడండి

తెలుపును పొందండి

# ఒకే గూటి పక్షులు

సుస్మితారమణివర్మ





భానుమూర్తి, బోసుబాబు మంచి స్నేహితులు. వారి స్నేహం ఒక్క ఆఫీసుకే పరిమితం కాదు. చదువుకున్న రోజుల్నుంచీ వారు మంచి స్నేహితులు.

ప్రతిరోజూ సాయంత్రం మెయిన్‌రోడ్డు ఈ చివర నుంచి ఆ చివర వరకూ సర్వే చేయడం వారికున్న అలవాటు. ఓ రోజు అలా సర్వేచేస్తూ - సూపర్ బజార్ జంక్షన్‌లో సోడాలు తాగుతూ వచ్చేపోయే జనాన్ని చూడసాగారు వాళ్ళు.

అంతలో ఆ వేపు పోతూన్న ప్రసాద్ వీళ్ళను చూసి ఆగి, "హల్లో భానూ! ఇంకా ఇక్కడే వున్నావేం? మనోడి పార్టీకి రావటం లేదా?" నవ్వుతూ పలకరించాడు.

పార్టీ విషయమే మరచిపోయిన భాను — 'ఇవేళ సాయంత్రం ఆరున్నర నుంచి ఎనిమిదిన్నర వరకు గ్రీన్స్ హోటల్లో మన 'రావు' మారేజి రిసెప్షన్ వుంది కదూ?' స్వగతంలా అనుకుంటూ ఆశ్చర్యపోతూ పార్టీ విషయం గుర్తు తెచ్చుకున్నాడు.

"సూపర్ బజార్‌లో నాకొక్కంచెం పనుంది. అదైంతర్వాత పార్టీకి వస్తాను." అంటూ ప్రసాద్ సూపర్ బజార్లోకి వెళ్ళిపోయాడు.

"ఇంతకీ ఏ'గావ్' పార్టీ ఇస్తున్నాడు..." సందేహంగా అడిగాడు బోసు.

బోసు అలా అడగటంతో అర్థం [illegible] పోలేదు.

బోసు, భాను ఒకే ఆఫీసులో - ఒకే ఆఫీసర్ హయాంలో పనిచేస్తున్నా - ఇద్దరి ఉద్యోగాలు ఒకే కేటగిరీకి చెందినవి మాత్రంకాదు. భాను టెక్నికల్ సూపర్‌వైజర్, బోసు మాత్రం మామూలు గుమాస్తా.

టెక్నికల్ వాళ్ళు— ఆఫీసు గుమాస్తాలు — తదితరులు— అంతా ఒకే డిపార్ట్‌మెంట్‌కి చెందినవారైనా—గుమాస్తాలకి— మిగతా వాళ్ళకి జీతాలు తక్కువ కావడంవల్ల— టెక్నికల్ సూపర్‌వైజర్లకి—మిగతా టెక్నికల్ స్టాఫ్‌కి జీతాలు ఎక్కువ కావడంవల్ల టెక్నికల్ వర్గంకి - గుమాస్తా వర్గంవారిపై అదోరకమైన చిన్నచూపు. గుమాస్తాలపై ప్రత్యక్షంగా కాకపోయినా పరోక్షంగానైనా ఈ చిన్నచూపు— టెక్నికల్ వాళ్ళకి పోకపోలేదు. వాళ్ళమధ్య ఆఫీసు పరంగా తప్పిస్తే మిగతా విషయాల్లో సంబంధ బాంధవ్యాలు అంతంత మాత్రమే.

పెళ్ళిళ్ళు విషయంలోగాని - ఇతరత్ర [illegible]గాని ఈ రెండు వర్గాల్లో ఒకరినొకరు ఆహ్వానించుకోడం అన్నది పూర్తిగా [illegible] చాలా తక్కువనే చెప్పాలి.

ఈ మధ్య టెక్నికల్ స్టాఫ్ బాగా పెరిగి [illegible] 'గావ్' అని గాని— '[illegible]' అని గానీ చెప్పడం చాలా కష్టం. ఈ మధ్య [illegible] "గురువుగారూ! మీరు తప్పక [illegible] నా పెళ్ళికి రండి" అంటూ ఆహ్వాన [illegible].

[illegible] పేరు ఏదో 'గావ్' అని— [illegible] మాత్రం ఈ రోజు సాయంత్రం గ్రీన్ హోటల్లో వుందని బాగా గుర్తు. అందుకనే "ఏ గావ్ పార్టీ ఇస్తున్నాడు?" అంటూ [illegible] సందేహంగా భాను [illegible]

"[illegible] కొత్తగా జాయినయిన సూపర్‌వైజర్లో పేరు...గోపాలకృష్ణకుమార్ కాదూ?..." అన్నాడు భాను.

"ఎలా వుంటాడతను?..." తనని ఆహ్వానించిన 'గావ్' [illegible] అడిగాడు బోసు.

"[illegible] వున్నాంగా...?" [illegible] అనేసరికి బోసు నవ్వసాగాడు.

"[illegible] మనవాడే కదా? పద [illegible]!" అంటూ భాను బలవంతం చేసేసరికి బోసు కాదనలేక పోయాడు. అయిదు నిముషాల్లో ఇద్దరూ గ్రీన్ హోటల్లో ప్రవేశించారు. హోటల్లో కరెంట్ లేదు.

పెళ్ళికొడుకుని 'విష్' చేసి— శుభాకాంక్షల్ని తెలుపుదామన్న తలంపుతో ఆ వేపు పోతోన్న బోసుని చేయి పట్టుకుని ఆపి భాను అన్నాడు— "ఈ చీకట్లో అతన్ని ఇబ్బంది పెట్టడం దేనికిరా?... ఇప్పటికే తన వంటూ ఎంత మంది మూగి వున్నారో

చూశావా ?... వెళ్లిపోయే ముందు ఫ్రీగా పలకరించొచ్చులే!'' బోసు భాను మాటల్ని ఖండించలేక పోయాడు. చీకట్లో తడుము కుంటూ వెళ్ళి ఖాళీగా వున్న కుర్చీలలో కూర్చున్నా రిద్దరూ.

పది నిముషాల్తర్వాత కరెంటు వచ్చింది.

ట్యూబ్‌లైట్ల కాంతిలో స్పష్టంగా పెళ్లి కొడుకుని చూసిన భాను, 'ఓహో! రావంటే ఈయనా ?' స్వగతంలా అనుకున్నాడు.

''తనకు ఇన్విటేషన్ ఇచ్చింది ఈరావేనా? అతనే ఇతనా ?... వచ్చినప్పుడు పలకరించనే లేదు వెళ్లిపోయేటప్పుడైనా తప్పకుండా పలకరించాలి...'' అనుకున్నాడు బోసు స్వగతంలో.

తన మట్టుగాని—ఎదురుగావున్న వాళ్లలో గాని గుమస్తా మిత్రులు ఒకరో ఇద్దరో మినహాయిస్తే అంతా టెక్నికల్ వాళ్లే! కొన్ని ముఖాలు తనకు పూర్తిగా పరిచయం లేనివి, కనీసం ముఖపరిచయమైనా లేనివి, గుడ్డికన్నుకంటే—మెల్లకన్ను నయంమన్నట్లు తన కెదురుగా భాను—ఆ ప్రక్క తనకు బాగా తెల్సిన మరో ఇద్దరు సూపర్‌వైజర్లు వుండ టంతో కాస్త రిలీఫ్ ఫీలయ్యాడు బోసు.

సర్వారాయుడు స్వీట్—హాట్ ప్లేట్లను అందరికీ అందించసాగాడు.

ఇంకా బోసులో తలెత్తిన అనుమానం వృద్ధిపొందుతూనే వుంది, 'ఈ రావు ఆ రావు కాడేమో ?... ఇతను అతను కాకుంటే ? ... మా బాగా దొరికిపోతాను. పోనీ వెళ్లిపోతేనో?.. ఇప్పుడు లేచిపోతే ఏం బావుంటుంది... అంద రికీ అనుమానం రాదూ ?...'

''ఏంమిత్రమా, ఆలోచిస్తున్నావ్ ? ఊఁ! లాగించు'' అంటూ భాను స్వీట్ పేకెట్ విప్పసాగాడు.

అయిదు నిముషాల తర్వాత ఒకాయన ప్రెజెంటేషన్ ఆర్టికల్ పట్టుకుని వచ్చి భాను ప్రక్కనున్న కుర్చీల్లో కూర్చున్నాడు.

''హల్లో, చిదంబరం! ప్రెజెంటేషనేవిటి కొన్నారు ?'' అంటూ పేకెట్ వేపు చూడ సాగాడు భాను.

ఇతను చిదంబరమా!?...

తను కంట్రిబ్యూషన్ కూడా ఇవ్వలేదే ? నెలాఖరు కదూ ? ఆఫీసు డబ్బులోంచి కొని వుంటారు. జీతాల్నాడు తప్పకుండా తన కంట్రిబ్యూషన్ ఇచ్చేయాలి.

చిదంబరం పేరుమాత్రం తనకు సుపరి చితమే!

ఆఫీసుకి సంబంధించిన కాగితాలపై తనెన్నిసార్లు సైను చేయలేదు ? మనిషి మాత్రం ఇతనన్నమాట! ...ఏం డిపార్ట్ మెంటో ఏమిటో!?...డిపార్ట్‌మెంట్‌కి తనేమీ మరీ కొత్తవాడు కాదు. ఎంతమందో పేర్లు తనకు తెల్సు, అయినా ఏంలాభం ?... ఆ పేర్లుగల మనుషులు ఫలానా—అని తెలియదే! తనతోటి గుమస్తా మిత్రులు తప్ప మిగతా వాళ్లెవరూ తనకు బాగా తెలీదు. సూపర్ వైజర్లయినా—గుమస్తాలయినా—మరెవరైనా డిపార్ట్‌మెంట్‌లో కొత్తగా చేరినవారిని అంద రికీ పరిచయం చేసే మంచి అలవాటంటూ ఒకటి ఏడ్చిచస్తేగదా ? వీళ్లు ఫలానా — వాళ్లు ఫలానా — అని తెలియడానికి! ... ఎవరైనా ఒకసారైనా పరిచయం చేస్తే కదా?... మరోసారి వారితో మాట్లాడ్డాని గాని... పరిచయం పెంపొందించుకోడాని గ్గాని!...

''ఆ రావు— ఈ రావేనా!''...అన్న అను మానం ఈ మనిషితో తనకు ఇదివరకే పరిచయం వుండి వుంటే ఎందుకు తలెత్తు తుంది?...

బోసు ఆలోచనలలా సాగిపోతున్నాయ్.

''పెళ్లికొడుకు మన టెక్నికల్ వాడైనా నాకా గురుడితో అసలు పరిచయమే లేదు గురూ! నా సెక్షన్‌కి వచ్చి ఇన్విటేషన్ ఇస్తూంటే మొదట నిజంగా తెల్ల ముఖం వేశాననుకో! ఆశ్చర్యపోతూ మీ రెవరండీ?— అని అడిగితే— తను ఫలానా అని స్వపరిచయం చేసుకున్నాడు. అప్పుడు నేను ఫలానా అని పరిచయం చేసుకున్నాను. అలాగుంది మన డిపార్ట్‌మెంట్ సంగతి! ఒకే గూటి పక్షులమే

---

**సీటు కోసం**

ఎవరన్నారు
తెలుగువాళ్లకు
'కాంపిటేటివ్ స్పిరిట్'
లేదని ? ...
ఖాళీ అయిన ఒక్కసీటు కోసం
సిటీబస్సులో
ఎంత మంది కుస్తీ పడతారో
ఒక్కసారి చూడండి!

— డాక్టర్ సింగిరెడ్డి తిరుపతిరెడ్డి

---

అయినా ఒకరి ముఖం మరొకరికి తెలీదు కొందరి పేర్లు కూడా మనకి తెలీవు.' చిదంబరం నవ్వుతూ చెప్పాడు.

'వాళ్ళలో వాళ్ళకే పరిచయాలు లేవు. కనీసం ముఖ పరిచయాలు కూడా లేవు. అలాంటప్పుడు బోడి నా లాంటి గుమాస్తా గాళ్ళకి వాళ్ళ పరిచయం ఎలా కుదురు తుంది?'... బోసు స్వగతంలా అనుకున్నాడు.

ఓసారి ఏమైందో తెల్సా?— అంటూ భాను కల్పించుకున్నాడు.

''అవి మేము చదువుకుంటున్న రోజులు' అప్పుడు ఎడ్యుకేషన్ టూర్‌లో వున్నాం. ఓ రోజు రాత్రి భోజనం చేయడానికి మంచి హోటల్ కోసం గాలిస్తున్నాం. మంచి హోటలేదీ మేమున్న పరిసరాల్లో కన్పించ లేదు. దగ్గర్లో ఎవరిదో ఓ ప్రక్క పెళ్ళి తతంగం— మరోప్రక్క విందు భోజనాలు జరుగుతున్నాయ్.

అప్పుడు మాలో ఎవరికీ మరిక నడిచే ఓపిగ్గాని— శక్తిగాని లేవు. మాలో ఒకడు సీరియస్‌గా అన్నాడు— ''మనం ఇంకెక్కడికి తిరగక్కర్లేదు. ఈ పెళ్ళి మా ఫ్రెండ్‌దే! మరేం ఫర్లేదు. మీరంతా నాతో రండి!'' ఆశ్చర్యపోతూ అందరం వాడితో వెళ్ళి సుష్టుగా విందు భోజనం లాగించేశాం.

ఆ తర్వాత తెల్సింది, మావాడు ట్రిక్ప్లే చేశాడనీను— అసలు వాళ్లెవరూ వాడికి తెలీద నీను. ఇంతకీ చెప్పొచ్చేదేమంటే — ఇలాంటి పార్టీలకు కూడా స్టయిల్‌గా కొత్తముఖాలొచ్చి లాగించేసినా ఎవరూ ఏం చేయలేరుకదా ? ఇదెక్కడ జరిగిందో తెల్సా?—బొంబాయిలో.''

భానుమూర్తి కథనంకి అంతా తెరలు తెరలుగా నవ్వుకోసాగారు. బోసుకి ముళ్లమీద కూర్చున్నట్లుంది.

ఎంతవేగంగా అక్కడ్నుంచి వెళ్లిపోదామా? —అన్నట్లుంది. ఎంత ఆలోచించినా ఈ రావు తన ఊహకి అందటంలేదు. నిజంగా తనను ఆహ్వానించింది ఈ రావేనా ?...లేకుంటే తన వేపు కూడా చూసి ఎందుకు నవ్వుతున్నాడు? ఆ నవ్వు వంకరనవ్వు కాదుగదా ? ఆ నవ్వు వెనుక భావం 'ఈ శాల్తీ పిలవని పేరంటా నికిలా విచ్చేసిందేం ? ఇలాంరావడం తన అల వాటేమో ?' అన్నది కాదుగదా ?... పిలిచే వుంటాడు. ఓరావు పిలిచాడు కదా ? అతనే ఇతను. ఆఫీసులో ఏదో బిజీలో వున్నప్పుడు ఓ సారి చూసిన ముఖం అంతిదిగా ఎలాగుర్తుం




**పి. ఎస్. బి. — హైదరాబాద్**

మీకు దేశంలో వేరే సమస్యలే నట్టు అన్యాయం జరిగిపోతోంది బాబోయ్ అనకపోతే—ఐకమత్యంతో సమస్యలు పరిష్కరించుకోవచ్చును కదా. ఈ ఆర్భాటంతో లేని సమస్యలు సృష్టించుకోవడంసబబేనా?

సమస్యలు లేకేనా చక్కెర ధరలూ, కృష్ణా పుష్కరాలూ, ఆత్మహత్యలూ, ఆడదాన్ని అవమానించడాలతో పత్రికలు నింపేస్తున్నారు?! 'అవరే ఇరిందా అంబట్టన్ ఎదుకు' అన్నట్టు ఐకమత్యం మానవత్వం ఉంటే ఒక జాతికి ఇంకొక జాతి తక్కువదన్న సమస్యే ఉండదు కదండీ!

**విల్. జి. ఆర్ — శంఖవరం**

మన ప్రజలు సినిమాలంటే అదేఒక దైవం, అదే ఒకభక్తి, స్నేహం—సినిమాని పూజిస్తున్నారు. యీ పిచ్చి ఎలా పోతుంది!

ఏముందీ, వరుసగా మంచి సినిమాలు చూపించడమే!!

**ఎం. ఏ ఎస్. — కామారెడి**

పెళ్లికూతురు అత్తవారింటికి వెళ్లే టప్పుడు ఏడుస్తుంది ఎందుకు?

కొత్త వాతావరణం ఎలా ఉంటుందోననీ, పాత వాతావరణం వదిలేస్తున్నానని ఆందోళన.

**ఆర్ హెచ్. జి — మెదక్**

ఆత్మకు, మనస్సుకుగల భేదం ఏమిటి?

ఆత్మ మంచిచెడుల విమర్శలు బేరీజువేయ్యడంలో నిమగ్నమవుతుంటే, మనస్సు కోరికలని సృష్టిస్తూ ఉంటుంది. రెండింటికీ ఎప్పుడూ ఘర్షనే. కాని మనస్సు పోడి ఆత్మ గెలిస్తే మనిషి ఆ పోటిమీ గెలుపే!

**మహమ్మద్ రఫీ — గుంటూరు**

మనిషికి ఏం కావాలో తెలియక ఇంతగాపరుగులు తీస్తున్న ఈ మనసుని మళ్లించడం ఎలా?

బాధ్యతలు చేస్తూన్నపని ఇదే రఫీగారూ! మీరు గుంటూరు చేరారా?!

**కృష్ణవేణి — విజయవాడ**

ఉందిలేమంచికాలం ముందు ముందునా!అందరూ సుఖపడాలి అంటూ ఆశతో ఎందరెందరో జీవన గమనాన్ని సాగిస్తున్నారే! వాళ్లను నేనుపిచ్చి వాళ్లనే అంటాను.

మిమ్మల్ని వాళ్ళూ అలాగే అనుకుంటారు! వర్తమానం కంటే భవిష్యత్తు మెరుగ్గా ఉండి తీరుతుందన్న ఆశ లేకపోతే మనుషులు వర్తమానం దాటరు. అందుకే భవిష్యత్తు వర్తమానంగా మారిపోతూ ఉంటుంది అందరికీ.

**టి. ఆర్. బి — విశాఖపట్నం**

మీమీద కార్టూన్సవేశాను. చూసి నవ్వుతారో, ఏడుస్తారో, నన్ను ఏడిపిస్తారో!

ఏదీ, అచ్చయ్యాక కదా!! కార్టూను చూసి ఏడవడానికి నేనేం సెన్స్ ఆప్ హ్యూమర్ లేని దాన్నను కుంటున్నారా?

**చంద్రిక, సువర్ణ — ఉండి**

ఆత్మరక్షణ కోసం స్త్రీలకి అందుబాటులో కరాటే క్లాసులు నిర్వహిస్తే బాగుంటుంది.

ప్రస్తుతం చాలా కాలేజీలలో యీ క్లాసులు నిర్వహిస్తున్నారు. కాని ఏం లాభం. ఇది అక్కరకు రాని విద్యగా రాణించకూడదు. ఏ బస్సు స్టాండులోనో అవసరం అయితే ఒ కరాటేకట్ పడేయాలి. గుడ్లు నీళ్లు కార్చుకుని పారిపోకూడదు. మన పిల్లలు ఫాషన్‌కోసం అన్నీ నేరుస్తారు. అదే వచ్చిన చిక్కు.

**జి. ఎస్. — విజయనగరం**

రామలక్ష్మిగారూ, మీ ఆడవాళ్లలో తొంభయి శాతం చేతికి గోళ్లు పెంచుతారు. అందం కోసమా? ఆత్మరక్షణ కోసమా?

అందం కోసమే. ఆత్మరక్షణకిరోజుల్లో గోళ్లు పనికి రావు. గొడ్డళ్లు కావాలి. నా స్నేహితురాలి కూతురు చక్కనిచిన్ని గొలుసులో గో పెద్ద పిన్ వేస్కు తిరుగుతుంది. అసహ్యంగా ఏమిటది అని అడిగితే, ఆంటీ! బస్సుల్లో తిరిగే మాకిది చాలా అవసరం. ఎవడైనా ఫన్నీగా బిహేవ్ చేస్తే, మరీ దగ్గరగాజరిగితే 'కసక్' అంది పిన్నుతెర్చిచూపిస్తూ. యీ కాలం పిల్లలు తెలివి మీరారు!

**టి. ఎస్. — కొత్తగూడెం**

కన్నీళ్లతో పోయిన మనిషి తిరిగి రాడని తెలిసే ఆ మనిషి కోసం కన్నీరు కారుస్తారెందుకు?

అదే మనం ఇవ్వగల చివరి కానుక కనుక.

**వి. కె. — పాలమూరు**

లౌక్యం అంటే ఏమిటి?

నీకు కావలసింది ఎదుటి వాళ్లచేత చెప్పించి చేయించకల్గడం. ఏ రాయేనా దొరికేదాకా వెంట బడతున్న కుక్కని "మా మంచి కుక్క కదూ" అంటూ ముద్దు చేయకల్గడం కూడా డిప్లమసీ అనవచ్చు.

**ఎం. బి. ఆర్. — బైపల్లి**

జీవితంలో మనిషికి ఆనందప్రదమైనరోజు ఏది?

తన కోరికలు తీరిన రోజు, తను గెలిచిన రోజు తన మాట చెల్లిన రోజు. అంతా 'తన' సంతృప్తి మీదే ఆధారపడి ఉంటుంది.

**యు. యు. — ఎమ్మిగనూరు**

జీవించడం కూడా ఒక కళ అంటాను.

నిజమే. అసంతృప్తితో తీరని కోరికలతో మన శ్శాంతికి దూరం అయ్యి జీవించడంకంటే, తృప్తిగా ఉన్నదానిలో హాయిగా ఉంటూ జీవించడం కళ చాలా కష్టసాధ్యం.

---

టుంది? ఉండడంకష్టం! ఈ గుమడి ముఖం ఇప్పుడింతదిగా చూశానుగనక్క ఇకమీదుట బాగా గుర్తుంటుంది.

బోసు అలా ఆలోచనలతో తర్జన భర్జన ఐపోతున్నా భానుమూర్తి మాత్రం సీరియస్‌గా హస్యాయణంలో మునిగిపోయాడు.

తనసుతను ఎంత సమర్థించుకుంటున్నా నిజానికి భానులా బోసు ఫ్రీగా వుండలేక పోతున్నాడు.

పెళ్లికొడుకు విషయంలో తన ఆలోచనలు ఓ కొలిక్కి ఇంకా రావటంలేదు.

'ఎందుకొచ్చిన తలనొప్పి? ఇక్కడ్నుంచి పోతేపోలా?' స్వగతంలా అనుకుంటూ లేచి నిల్చున్నాడు తను.

"ఓ ఫ్రెండ్ నా గురించి వెయిట్

## ఒకేగూటి పక్షులు

చేస్తున్నాడ్రా ఈ బైంకి. అర్జంటుగా వేనింటికిపోవాలి" భానుతో చెప్పాడు బోసు.

"ఐతేపద! నేనూ వచ్చేస్తా!" అంటూ భాను కూడా లేచాడు.

అప్పుడే వచ్చిన ఓ డజనుమంది పెళ్ళికొడుక్కి— పెళ్ళికూతురికి శుభాకాంక్షలు తెలియజేస్తూ గుంపుగా నిల్చున్నారు. ఆ సమయంలో బోసు నెమ్మదిగా బుర్రదించుకుని బయటకు వచ్చేశాడు.

ఆ తర్వాత భాను కూడా బయటకు వచ్చాడు.

అంతలో హోటల్లోకి పోబోతూ భానుమూర్తివేపు వెనక్కి తిరిగి చూసి, "హల్లో భానూ!" అంటూ ఒకతను భానుమూర్తిని పలకరిస్తూ దగ్గరకు వచ్చాడు.

"హల్లో రావ్!" అంటూ భాను కూడా పలకరించాడు.

"సెలవులో వున్నాను కదా? మళ్లీ మళ్లీ కల్సుకోడానికి వీలుపడదు. పెళ్ళికి మాత్రం తప్పకుండా రావాలి సుమా!" నవ్వుతూ చెప్పాడు రావు.

ఆ రావు ముఖంలోకి పరిశీలనగా చూడసాగాడు బోసు.

"ఏమిట్రా, అలా చూస్తున్నావ్!?... ఇతను కూడా మన డిపార్ట్‌మెంటే! ఆఫ్ కోర్స్! మా జాతి పక్షనుకో! క్రిందటి నెల్లోనే జాయినయ్యాడు" అంటూ భాను వాళ్ళిద్దరికీ పరిచయం చేశాడు.

# ఒకే గూటి పక్షులు

"గురువుగారూ! మీరు కూడా రావాలి నా పెళ్ళికి. మరచిపోకూడదు సుమా!" నవ్వుతూ చెప్పాడు రావు బోసుతో. అలాగే వస్తున్నట్లు తలూపాడు బోసు.

ఈరావ్‌ని తనెక్కడో చూసినట్లుగుర్తు! ఎక్కడ చూసుంటాను చెప్మా?... ఆఁ!... ఈ రావ్ తప్పకుండా ఆ రావే! గురువుగారూ! మీరు తప్పకుండా రావాలి నా పెళ్ళికి— అంటూ ఇన్విటేషన్ ఇచ్చింది ఈ రావే! ఆఁ! ఈ రావు పెళ్ళి టెక్కలిలో అనుకుంటాను, ఇన్విటేషన్‌లోఅలానే వున్నట్లు బాగా గుర్తు. అంటే!?... మేడమీదున్న రావ్ ఎవరో తనకు తెలిసే తెలీదన్నమాట!?... ఓహ్! ఎలాంటి పరిస్థితిలో చిక్కుకు పోయాను!?...ఎనీ హవ్ గప్‌చిప్‌గా బయట పడ్డాను. పెళ్ళి రిసెప్షన్ తాలూకు తేదీలలో బాగా కన్‌ఫ్యూజై పోయాను. ఎందుకైనా మంచిది, ఈ రావ్ పెళ్ళి గురించి నేకగా ప్రశ్నించి చూద్దాం. తన సందేహం కూడా తీరిపోతుంది.

"రావ్‌గారూ! మరి టెక్కలిలో పెట్టేశారేంటండీ, మీ పెళ్ళి? పెళ్ళికి రావడం కాస్త కష్టమే అనుకోండి! అయినా రావడానికి సాధ్యమైనంతవరకు ప్రయత్నిస్తాను" బోసు రావ్ ముఖంలోకి చూస్తూ అన్నాడు.

బోసు మాటలకు రావ్ నవ్వేస్తూ అన్నాడు— "మీరు భలేవారండీ! జోక్సు మా బాగావేస్తారే!?..నా పెళ్ళి టెక్కలిలో కాదండీ! ఈఊర్లోనేనండీ! ఆఁ!... టెక్కలిలో పెళ్ళి మన వెంకట్రావుదండీ! క్రిందటి వారంలోనే తన పెళ్ళి అయిపోయింది. ఇవ్వేళ అప్సరాలో పార్టీ కూడా ఇస్తున్నాడు. మన గోపాల్రావ్‌కి ఓమారు ముఖం చూపించేసి ఆ తర్వాత అప్సరాకి వెళ్ళాలి. పిలిచింతర్వాత వెళ్ళకపోతే బాఁవుండదు కదా? పెళ్ళికి రావడం మరచి పోకండి" అంటూ ఆ రావ్ హోటల్లోకి వెళ్ళిపోయాడు.

బోసు అదోలా ఫీలయ్యాడు — విషయం బుర్రకెక్కేసరికి. 'ఛత్! ఇకమీదట బాగా పరిచయం వున్నవాళ్ళ పెళ్ళిళ్ళకే వెళ్ళడం మంచిది. లేకుంటే ఇలానే బాధపడ్డం, దొరికి పోవడఁవూను' స్వగతంలా అనుకుంటూ పెళ్ళిళ్ళ విషయంలో గట్టిగా ఓ నిర్ణయం తీసుకున్నాడు బోసు.

# భేషజం




## యిందుర్తి సత్యన్నారాయణరావు

"బాబూ! సాయంత్రం తీరుబడవుతుందిరా నీకు ?"

"ఎందుకమ్మా ?" అడిగాను.

"సత్యానందస్వామి వారొచ్చారుట నిన్న, చూట్టానికెళ్దాం."

"ఎవరూ ?"

"సత్యానందస్వామివారని, రిషీకేశం నించి వచ్చారుట! చాలా మహిమ గల స్వామిట! జమీందారుగారు స్వామివారు హైదరాబాదు వస్తే, ఓ నెల రోజులుండమని తీసుకొచ్చార్ట మనూరు. కామాక్షమ్మ వాళ్ళు నిన్ననే వెళ్ళి దర్శనం చేసుకొని వచ్చేశారు."

"నాకీరోజు తీరదనుకొంటా, సాయంత్రం ఓ ఆపరేషను చేయాలి. ఎట్లాగూ నెల్రోజులుంటా రంటున్నావుగా, నేను తర్వాత వెళ్తాలే! కారు పంపిస్తా, వెల్తే ఎండ తగ్గాక, సాయంత్రం నువ్వెళ్ళిరా" అంటూ బైటకొచ్చేశాను.

* * *

"ఏంటీ! ఆవకాయ కారం వేసుకోని భోజనం చేసేసారా రాత్రి ?" అడిగాను.

"లేదే" అన్నాడు ఖంగారుగా పరంథామయ్య గారు.

"ఏంటి – భోజనంలో ఆవకాయ తిన్లేదా ?"

"ఊఁ! తిన్నేదు."

"ఒట్టి కారమే తినేసారన్న మాట."

"మీతో కష్టమే సుమండీ! ఏదో యింట్లో కొత్త ఆవకాయ పెట్టి, పాళా సరిగ్గా వుందో లేదో చూడమంటే ఓ చిటికెడు రుచ్చూసా."

"ఓహో! మీ చిటికె వొక్క రోజులో మీ ఆరోగ్యాన్ని సగం తినేసింది. ఇహనించైనా జాగ్రత్తగా వుండండి. మందులు జాగ్రత్తగా తీసుకోండి. చూడండీ... నా మాట ఖాతరు చేస్తేనే మీకు నేనేమైనా సహాయం చేయగలిగేది... వెళ్ళండి."

"సరే బాబూ! కానీ యీ జిహ్వ చాపల్యం వుంది చూడండీ..."

"చూడను. రేపు సాయంత్రం రండి మళ్ళీ" అన్నాను విసుగ్గా.

"వస్తా బాబూ! తమరు కోపగించుకోకండి" అంటూ వెళ్ళిపోయాడాయన. ఇంతలో ఫోను మోగింది. రిసీవర్ తీసి "హలో" అన్నాను.

"అదృష్టం! ఏ ఆపరేషను థియేటర్లోనో వున్నారనుకొన్నా! ఏంటి తీరిగ్గా వున్నట్లున్నారు" జమీందారుగారి గొంతు గుర్తుపట్టాను.

"నమస్కారమండీ! ఏంటీరోజు పొద్దుటే నేను గుర్తొచ్చాను. ఆరోగ్యం బాగుందా ?" అడిగాను.

"తమరి దయవల్ల."

"నా దయేముందిలెండి ... యీ మధ్య తమకు ఆధ్యాత్మికచింతన ఎక్కువవుతున్నదిటగా..." అంటూ నవ్వాను.

"అదే అదే! ఆ విషయం చెబ్దామనే ... సత్యానందస్వామివారని, హృషీకేశ్ నివాసి – దక్షిణ యాత్రలకని వస్తే, మనూర్లో వేంచేయమని నేనే బలవంతంగా తీసుకొచ్చా! సాయంత్రం అమ్మగారితో పాటు వొకసారి రండి."

"అమ్మ సాయంత్రం వస్తానంది ... క్షమించాలి, నాకు తీరదనుకొంటా."

"ఏంటండీ అంత తీరిక లేకుండా! అంతటి

# పర్వతాల నిశ్శబ్దంలో అనంత అందాల గుసగుసలు

ఎటు చూసినా పచ్చగా కలకలలాడే లోయలనుంచి మంచుతో కప్పిన కొండ శిఖరాలకు పిల్ల వాయువుల మృదుగానంతో నిండిన పచ్చిక బయళ్ళనుంచి గుట్టలతో, చంద్రమండల సదృశమయిన ఉన్నత ప్రదేశాలకు పర్వతాల మంత్రముగ్ధ సౌందర్యం ఎన్నడూ నిరుత్సాహ పరచదు. హిమాలయాలు, పశ్చిమ కనుమలు, నీలగిరులు ... ప్రతీదానికి ఒక ప్రత్యేక అందం. ప్రతీదీ కూడా, రెండవ దాని మోస్తరుగానే అద్భుతమయిన, ఆకర్షణీయమయినది.





**ఉత్తరాదిన ఉన్నత శిఖరాలలో.**

కాశ్మీర్ గుసగుసలాడుతూ పారే సెలయేళ్ళ పూలు జల్లిన ఉద్యాన వనాలు నిర్మల సరోవరాలు విచిత్రానుభూతి కలిగించే పడవ ఇండ్లు, శ్రీనగర్, పహల్‌గాం, గుల్మర్గ్ కాలినడకన పర్వతారోహణ, గుర్రపు స్వారీ, చేపలు పట్టటం చలిమంటచుట్టూ చేరి ఆటలు, పాటలు అదే కాశ్మీర్! ఎల్లప్పుడూ అద్భుతమైనదే! ఎల్లప్పుడూ సజీవమైనదే!

హిమాచల్. ఆ ప్రాంతం అక్కడి ప్రజలంతగాను వర్ణరంజితమై ఉంటుంది కులు, మనాలి, సిమ్లా, డల్హౌసీ ప్రశాంతమైన వెదురు డొంకలుగుండా కొండలు, మంచు ప్రాంతాల వైభవంలోకి అడుగుపెట్టవచ్చు, ఒక అద్భుత లోకం

ఉ ప్ర. ముస్సూరి పర్వత విశ్రాంతి కేంద్రాలకు మకుటధారి కొండలో కాలినడక తిరిగేవారికి స్వర్గతుల్యమైనది

నైనితాల్, అల్మోరా, రాణిఖేత్, టహరి ప్రజల అభిమానమంతగాను అందమయిన భూమి

**పడమటి కొండల దివ్యభావం.**

మహాబలేశ్వర్, ఖాండిలా లొనావ్లా. పడమటి కనుమల నడిబొడ్డున భద్రపరచబడ్డాయి. అందమైన వెదురు తోటలు, మిరుమిట్లుగొలిపే నారింజ తోటలు కొత్త అందాలు చేకూరుస్తాయి.

**తూర్పున కొండల ఇంద్రజాలం.**

మంచుతో కప్పబడిన శిఖరశ్రేణులు ఒకదాని వెనక మరొకటి, ఆకాశంలో ఉవ్వెత్తుకి ఎదిగి ఉంటాయి అక్కడి ప్రకృతి సౌందర్య చిత్రలేఖనం పై చుక్కలుగా బౌద్ధారామాలు, దేవాలయాలు కనబడతాయి నిత్యం సంతోషంగా, జీవితాన్నే కేళి చేయనట్టు కనిపించే సహృదయులు—కొండప్రాంతపు ప్రజలు చిరునవ్వుతో స్వాగతం చెబుతారు డార్జిలింగ్, కుర్సియాంగ్, షిల్లాంగ్, కేలింపాంగ్ — అన్నీ కూడా జీవంతో ఉట్టిపడుతూ, మీకోసం ఎదురుచూస్తూ ఉంటాయి.

**దక్షిణాది నీలగిరులు.**

హిమాలయాలు తమ అనంతమైన అందంతో, దర్జాతో ఆకట్టుకుంటే, నీలగిరులు తమ పచ్చటి చెట్లతోను, ఉమందల సౌరభంతోనూ అలరిస్తాయి

ఉదకమండలం కూనూరు కొడైకెనాల్ మృదువుగా దొర్లే కొండలు, మధ్య మధ్య పసుపుపచ్చగా కనబడే నదీ ప్రవాహాలు ఈ కొండల మధ్య అందమైన అంతపులు సందు చేసుకు కూర్చుంటాయి మలయమారుతం చల్లగా వీస్తూ, దేవదారు చెట్లు సుగంధాన్ని వెదజల్లుతూ ఉంటుంది

పర్వతాల మధ్య విశ్రాంతిగా గడిపేందుకు రండి. మీరు మీ విశ్రాంతి కాలాన్ని పొడిగించుకునేట్టు చేసే ఎన్నో ఆనందాలు



మీరు ఎక్కడ ఉన్నా సరే, ఇండియన్ ఎయిర్‌లైన్స్ సర్వీసులు మీకు అతి సులభంగా లభిస్తాయి 69 కేంద్రాలకు అతి త్వరితంగా, అన్ని సదుపాయాలతో మిమ్మల్ని తన విమానాలలో చేరవేస్తుంది కొద్ది గంటలలోనే మిమ్మల్ని మీ గమ్యానికి చేరుస్తాం

**అతి దగ్గరలో ఉన్న మా కార్యాలయాన్ని లేదా మీ ట్రావెల్ ఏజెంట్‌ని కలుసుకోండి.**
**మీ విశ్రాంతి కార్యక్రమాన్ని ఈరోజే నిర్ధారించుకోండి**



**పలు ప్రదేశాలకు**
**IA ద్వారా**
**ప్రయాణం చేయండి**

## ఇండియన్ ఎయిర్‌లైన్స్

దక్షిణ ఆసియాలో అతి పెద్ద ప్రాంతీయ విమానయాన సంస్థ

## ఆకాశంలో అందాల దీపులు

# భేషజం

స్వామివస్తే, దర్శనం చేసుకోకుండా — ఎంతైనా మీ కుత్రబుద్ధి పోనిచ్చుకోలేదు.''

''కుత్రబుద్ధని కాదు ... యిక్కడ పేషంట్స్ ... '' అంటూ నీళ్ళు నమిలాను.

''అంతగా పేషంట్లుంటే వాళ్ళనీ కార్లో వేసుకోనొచ్చేయండి. స్వామివారు విబూది, ప్రసాదం యిస్తే సర్వ రోగాలూ కుదుర్తాయి. మీకు తెలుసో, లేదో శ్రీవారు కుష్ఠురోగాన్ని కూడా విభూతి ఇచ్చి కుదురుస్తారు'' అన్నారాయన ఆవేశంగా.

''పాహిమాం! అయితే నా ప్రాక్టీసు మాటేమిటి! ఇలాటి సమయంలో నా పేషంట్లనసలు వదలగోడదు ... కానీ నా కేదైనా రోగమొస్తే నవగ్గా నయం చేయించుకోడానికి స్వామివారి వద్దకే వస్తాలెండి ... ప్రస్తుతానికైతే నాకే జబ్బూ లేదు కదా!'' అన్నానాయన్ని నవ్విద్దామని.

''లేకేం ... ముప్పైయేళ్ళొచ్చాయి...బ్రహ్మచర్యం జబ్బు లేదూ మీకు? స్వామివారు దీవిస్తే మూడ్రోజుల్లో కళ్యాణం కుదుర్తుంది!''

''హతోస్మి! యీ మాట అనేరు సుమా! యీ నెలంతా శ్రీవారి శుశ్రూషల కోసం ఎన్ను నియోగిస్తుంది ... ''

''ఈ పరిహాసాలకేం లెద్దురూ! సాయంత్రం కాకుంటే మరోసారి రండి ... మొత్తానికి యీ అవకాశాన్నొదలొద్దు. గొప్పమహిమగల వారాయన.''

''తప్పకుండా వస్తాను ... మీ మాట కాదనగలనా? వుంటాను'' అంటూ ఫోను పెట్టేసాను. తర్వాత నా గొడవలో పడి ఆ విషయమే మర్చిపోయాను

* * *

''చూసారా! నాలుగు రోజుల్లోనే ఎంతగా కోలుకొన్నారో! తెలుగు మందులకే కాదు, ఇంగ్లీషు మందులకూ పచ్చం చేయాలి. రోగాలకు భేదం లేదు వైద్యమేదైనా'' అన్నాను వుత్సాహంగా పరంధామయ్యగారితో.

ఆయన నవ్వి — ''పచ్చమా ... పాడా! ఈ ఏడాది మా ఆవిడ మహారుచిగా చేసింది వూరగాయ, నాలిక లేచొచ్చేట్లు ... ఆ రోజు సాయంత్రం జమీందారుగారింటికి విజయం చేసిన స్వామివారికి నా గోడు చెప్పకొంటే — విబూది ప్రసాదించారు ... నలిక చంపుకోడానిక్కాదు, భగవంతుని కీర్తించడానికని సెలవిస్తూ — సత్యం గల స్వామి... దెబ్బతో రోగం టక్కున కుదిరింది! యిన్నాళ్టికి హుషారుగ వున్నాను... అన్నట్లు మీరు వెళ్ళలేదా స్వామివారి దగ్గరికి?'' అడిగాడాయన.

నాకు మతి పోయింది నాలుగు రోజుల క్రితం ఆ స్థితిలో వున్న రోగి కారం, వుప్పూ తినేసీ, యింత హుషారుగా, ఆరోగ్యంగా వుండటం వైద్య శాస్త్రానికే సవాలులా కనిపించింది.

''వాహ్వా అదా విషయం... మంచిది... యేమైతేనేం ఆరోగ్యం చక్కపట్టం కదా కావల్సింది'' అన్నాను నిర్లిప్తంగా.

''కోప్పడకండి... యీ రోగం స్వామివారు కుదిర్చారు. మళ్ళీ మరో రోగం రాదనేంటి? శ్రీవారు శాశ్వతంగా యిక్కడే వుండరు గదా! ఎప్పటికీ మీ అవసరం మాకు వుంటూనే వుంటుంది. ఈ లెక్క మీవద్ద — వుంచండి'' అంటూ మూడు వంద రూపాయలు తీసి బల్లమీద పెట్టాడాయన. రశీదిచ్చి పంపేశానాయన్ను.

* * *

స్వామివారు మా వూరొచ్చిన పదిహేను రోజులకు — నేను ప్రాక్టీసు పెట్టిన యీ మూడేళ్ళ తర్వాత — ఆ రోజు నాకు తీరిక లభించింది. విశ్రాంతిగా కుర్చీలో కూర్చొని ఆలోచనలో మునిగిపోయాను.

''జలుబు, జ్వరం వచ్చినవారి సంగతి వేరు — వారికి మందు వాడకపోయినా, సహజంగా శరీరంలో వుండే నిరోధకశక్తి వలన అవి నయమైపోతాయి.

కానీ యీ స్వామివారు కేవలం విబూధి, అరటిపండు వంటివి ప్రసాదించి గుండెపోటూ, రక్తపోటూ, క్షయ, వుబ్బసం, కడుపునొప్పి — యిలాటి వ్యాధులను కూడా ఎలా నయం చేయగలుగుతున్నాడు?

ఎంత కాదనుకొన్నా యీ రకం పేషంట్లకు సగానికి సగం జబ్బు నయం చేసేసాడు అది మాత్రం నిజం.



వీర్రాజు లాంటి గుండెజబ్బు మనిషి వొక్క వారంలో ఎంతగా కోలుకొన్నాడు! పట్నంలో చదువుకొంటున్న కొడుకు ప్రమాదంలో మరణించాడని తెల్సినా నిబ్బరంగా ఎలా వుండిపోగలిగాడు? నిజంగా యీ వైద్య శాస్త్రానికి అందని అద్భుతమేదో వుండి వుండాలి.'' ఆయన్ని దర్శించుకోడంలో చిన్నతనమేమీ లేదనిపించింది నాకు.

''రోగాలను నయం చేయడమే కాకుండా, అయిదేళ్ళుగా నడుస్తూ, ఓడిపోవడం ఖాయం అనుకొన్న వ్యాజ్యంలో జమీందారుగారికి పది లక్షల రూపాయల ఆస్థి కల్సిరావడం స్వామివారి మహాత్యం కాదా? ముప్పై రెండేళ్ళ, స్ఫోటకం మచ్చల సీతకు యింత అకస్మాత్తుగా పెళ్ళి నిశ్చయం కావడం స్వామివారి దీవెన ప్రభావమేనా?''

ఇలాటి ఎన్నో విషయాలే కాక — ''యిదేమి ప్రారబ్ధమోగాని వీడికి ఓ భక్తీ లేదు రక్తీ లేదు. ఎంతసేపూ రోగాలూ, రోగుల గొడవే'' అన్న అమ్మ నిట్టూర్పులు కూడా నన్నా సాయంత్రం స్వామివారి దర్శనానికి వెళ్ళమని పురిగొల్పాయి.

* * *

ఆ సాయంత్రం జమీందారు గారింటికి వెళ్ళాను. జమీందారుగారు ఆర్భాటంగా ఎదురొస్తూ ''రండి రండి, మీకోసం నేనే మళ్ళీ కబురు చేద్దామనుకొంటున్నా... స్వామివారు దర్శనం యిచ్చే వేళయింది... యిలా రండి'' అని, విశాలంగా వున్న గదిలోకి నన్ను తీసికెళ్ళారు.

అరటి, మావిడాకులతో, పూలతో చక్కగా అలంకరించబడి వుందా గది. సంబ్రాణి పొగ, అగరొత్తుల వాసనా పవిత్రంగా తోస్తున్నాయి!

పెద్దగా వున్న వేదిక పైన ఖరీదైన తివాచీ పరిచివుంది. అక్కడ అమర్చివున్న పీఠం మీద అప్పుడే జింక చర్మాలు తెచ్చి కప్పుతున్నారు ఎవరో యిద్దరు కాషాయ వస్త్రాలు ధరించిన యువతులు.

వేదికకు ఎదురుగా నేలమీద జంపఖానాలు, చాపలు పరిచివున్నాయి. అవి దాదాపు అప్పటికే నిండిపోయాయి జనంతో. నేను ఆ గదిలోకి రాగానే వాళ్ళలో సగంమంది లేచి నిల్చొని నాకు నమస్కరించారు. నాకు సిగ్గనిపించిందా సమయంలో! నాకు నమస్కరించకుండా, నేనెవరా అన్నట్టు చూస్తున్న వాళ్ళు బహుశా దూరప్రదేశాల నించి వచ్చినవారై వుండాలి అయినా వారే నా గౌరవాన్ని దక్కిస్తున్న వారిలా తోచారు నా కప్పుడు. 'లేకుంటే స్వామివారి సన్నిధిలో నాకు నమస్కారాలేమిటి?'

''మీరలా కూచోండి... నేను స్వామివారిని ఆయత్తపరచి వస్తాను'' అంటూ లోపలికి వెళ్ళారు జమీందారుగారు.

యింతలో ఆ జనంలోంచి నలుగురైదుగురు పెద్దమనుషులొచ్చి నా చుట్టూ మూగారు. వారిలో వీర్రాజుగారూ వున్నారు.

''ఎలావుంది వొంట్లో'' అడిగాను.

''బాగానేవుంది బాబుగారూ! స్వామివారు చేయబట్టే పాడురోగం నయమైంది, లేకుంటే అబ్బాయి పోయాడని తెల్సిన మరుక్షణం యీ వెధవ గుండె ఆగిపోయి వుండేది కాదూ?'' అన్నాడాయన.

నాకెందుచేతో ఆయన మాటలు అసహజంగా తోచాయి.

పక్కనే వున్న రామదాసుగారు ''అవునండీ! ఆ జబ్బు నయమవడం దారటుంచి, అబ్బాయి పోయిన దుఃఖం వించి స్వామివారి బోధనలే వీర్రాజుగారిని వూరడించాయి'' అన్నాడు.

నేను వారితోపాటు ముందు వరసలోకి వెళ్ళి కూర్చున్నాను. ఇంతలో జయజయ ధ్వానాలు, కలకలం వినిపించాయి. స్వామివారు పరివారంతో సహా వేదిక పైకి వచ్చారు. అంతమందిలోనూ పచ్చటి రంగులో, ఎత్తుగా, లావుగా; కాషాయ వస్త్రాన్ని చీరకట్టూ, పంచకట్టూ రెంటికీ మధ్యగా వున్న పద్ధతిలో ధరించి, చుట్టూవున్న జనాన్ని రుద్రాక్షమాల వేలాడుతున్న కుడిచేత్తో దీవిస్తూ వస్తున్న ఆయన్ని సులభంగా గుర్తించగలిగాను. ఆయన వేదికమీదకు వచ్చి, జింక చర్మం అందంగా పర్చి వున్న పీఠంమీద కూర్చుని, కమండలం పక్కన వుంచుతూ; దండంమీద కుడిచేయి ఆన్చి, రుద్రాక్షమాల తిప్పుతూ, కాళ్ళు కింద పీటమీద పెట్టుకొని క్షణంసేపు కళ్ళు మూసుకొన్నారు.

కాంతితో వెలిగిపోతున్న గుండ్రటి ముఖం, నున్నగా గీసిన గడ్డం, మీసాలు లేవు, బోడిగుండు... జుట్టు పెంచుకొనే స్వాములనే చూసానుగాని

[48వ పేజీ చూడండి]

## గోళ్ళు సరిగ్గాలేవా?



## అవి మెత్తగా/చెక్కేసినట్టు/ పగిలి/పెచ్చులూడి/ గిడసబారాయా?

ఇప్పుడు
అద్వితీయమైన
ప్యాక్‌లో అదనపు
ధర పెట్టకుండానే.

మీకు కావాలి

# కాల్షియం-శాండోజ్®

బిళ్ళలు

## వాడి చూడండి, మీకే కనిపిస్తుంది ఆ తేడా.

మీరు చేయవలసిందల్లా వెనిల్లా వాసనగల, రుచియైన 4 కాల్సియం శాండోజ్ బిళ్ళల్ని ప్రతిరోజూ పదిహేను రోజులపాటు తీసుకోవడమే మీ గోళ్ళిక దృడంగా, అందంగా తయారౌతాయి శాస్త్రీయ అద్యయనం వలన యీ విషయం బుజువైంది తీసుకోండి— కాల్షియం శాండోజ్—స్విట్జర్‌లాండ్‌లో శాండోజ్ వారిచే రూపొందించబడిన, ప్రపంచంలోకల్లా ఉత్తమమైన కాల్షియం కాల్షియం—శాండోజ్ కావాలని పేరు పెట్టి అడిగి తీసుకోండి. అంతేగాని దానికి బదులు మరి దీనిని తీసుకు సరిపెట్టుకోకండి

ఈ సమస్య మళ్ళా తలెత్తుతే,
ఆ మోతాదును మళ్ళా
తీసుకోండి




daCunha-S-22 TL




## 14

ఇల్లు అమ్మేయడానికే నిశ్చయం అయింది.

ఆ నిశ్చయం తెలియజేస్తూ రాయగానే అనకాపల్లిచిన్నాన్నరెక్కలుకట్టుకవచ్చి వాలేరు. అతడి ముఖం ఆనందంతో దాగరంతయింది పిన్ని తమ ఆర్థిక దుస్థితి గురించి ఏకరువు పెడితే, చిన్నాన్న ఇంటికి పేలే ధర గురించి చర్చించేరు.

ఇక్కడికి వచ్చేక పిన్నికి హోటల్‌నించి ఇడ్లీలూ, మూడేసి సార్లు కాఫీ లేకపోయే సరికి చాలా అవస్థ అయింది. అమ్మ పొద్దున్న ఒక్కసారే కాఫీ ఇచ్చేది వంట ఆలస్యం అవడం వల్ల, చిన్నాన్నకీ, పిన్నికీ ఓ పొంగరం ఎంటేది పోసి, ఆవకాయ ఊట సంజుకుందుకు వేసి ఇచ్చేది. పిన్నికీ పొంగరం గట్టా రుచించేవికావు. అయినా సరే బయటకి తనకి ఇడ్లీ, దోసె కావాలని అనలేకపోయేది. అత్త గారున్నారాయె ! ఆమె ముందు బయటపడిపోవడం ఇష్టం లేదు !

శ్రీనుని ఆమె పక్కకి పిలిచి, రూపాయిచ్చి, "శ్రీనుబాబూ ! కొబ్బరి గట్టిచెట్నీ వేయించి ఇడ్లీలు స్ట్రాటానాయనా !" అంది తెచ్చినందుకు అణా లంచం ఇచ్చింది

శ్రీను హోటల్‌కి వెళ్లి వేడి వేడి ఇడ్లీలు, అడ్డాకు విస్తరిలో పొట్లాం కట్టించి తీసుకొచ్చాడు. కాని, దురదృష్టవశాత్తూ అది అమ్మ దృష్టిలోపడి పోయింది !

"ఏమిట్రా శ్రీనూ ఆ పొట్లాం ?" అని అమ్మ అడగ్గానే శ్రీను నీళ్ళు గారిపోయేడు —

"పిన్ని ఇడ్లీలు తెమ్మంటే తెచ్చేనమ్మా !" అంటూ సంగి రోజేడు

వెంటనే పిన్నమ్మ రంగంలోకి దిగి, ప్లేటు ఫిరాయించింది ... "పిల్లల కోసం నేనే తెప్పించే నక్కా !" అంది.

అమ్మ అసలు సంగతి అర్థం చేసుకుంది. వస్తున్న నవ్వుని ఆపుకుంది ఈ ఇడ్లీలు కాస్తా పిల్లలకి పంచేస్తే పిన్నికి ఏమీ మిగలదని తెలుసు కుంది. "పిల్లలకి ఇడ్లీలెందుకమ్మా రాజ్యం ! వాళ్లు తినరు ! చల్దివణ్ణం తప్ప మరోటి పడదు వాళ్ళకి !" అంటూ అడ్డు చెప్పింది.

రామం, శ్రీనూ, చంపా ఆ ఇడ్లీల చుట్టు పక్కలకి రావడానిక్కూడా అమ్మ ఒప్పుకుంది కాదు.

ఈ అనకాపల్లి పిన్నమ్మంటే ఇష్టంలేని

(గత సంచిక తరువాయి)

రామం, "మా కివి అలవాటు లేవు పిన్నీ ! తింటే అజీర్తి చేస్తాయి !" అంటూ ఓ వెళుకు విసిరేడు

చంపాకి ఒకరంటే ఇష్టం ఒకరంటే అయిష్టం అంటూ లేదు. ఇంటికి చుట్టాలంటూ ఎవరొచ్చినా ఇష్టమే — సందడి ఉంటుంది—చుట్టాలున్నప్పుడు అమ్మా, నాన్నా తమమీద ఆంక్షలు విధించరు.

తెచ్చిన ఇడ్లీలో ఎవరికి వంతుపెడదామన్నా ఎవరూ తినరు ! అమ్మ సరేసరి ! నాన్నా, చిన్నాన్నా ఇంట్లోలేరు — ఇల్లు అమ్మే వ్యాపకంమ్మీద వీధిలోకి వెళ్లేరు, పార్వతీపురం నించి ఓ మనిషి ఇల్లు కొనడానికి వచ్చినట్టు తెలిసి ఎవరూ తినక పోవడంతో, పిన్ని ముఖం ముడుచుకుంది. అమ్మ ఖాతరు చేయ్యలేదు. పాపం! పిన్నమ్మ ఎనిమిది ఇడ్లీలు కష్టపడి తిని, తక్కినవి పనిమనిషికి పడేసింది.

మర్నాడు అమ్మే, శ్రీనుని హోటల్‌కి పంపి నాలుగిడ్లీలూ, రెండు దోసెలూ తెప్పించి, పిన్నికీ, చిన్నాన్నకీ పెట్టగా, చిన్నాన్న ఎంతో సంబర పడిపోయేరు !

"అన్నయ్యా ! నీ సంగతేమిటి ?" అని నాన్నని అడగ్గా ..

"ఒరే తమ్ముడూ ! నేను తొమ్మిదింటి కల్లా అన్నం తినేస్తాను !" అంటూ నాన్న చెప్పేరు పిన్నికి నిన్నటి కోపం పోయింది.

ఇక్కడ ఏ బేరమూ కుదరక నాన్న, చిన్నాన్న కలిసి పార్వతీపురం వెళ్లేరు. ఇంటి దస్తావేజులు కూడా పట్టుకువెళ్లేరు.

పిన్ని అనకాపల్లి వెళ్లిపోయింది, "అక్కడ పిల్లలకి వండిపెట్టే వాళ్లు లేరక్క !" అంటూ— దగ్గరుండిడబ్బు వ్యవహారమంతా పరిష్కరించాలని ఆమెకుండెను — అయింది కాదు.

మూడోరోజు కల్లా నాన్నా, చిన్నాన్న వచ్చేసేరు.

పార్వతీపురంలోని ఇల్లు అమ్మేసి డబ్బు పట్టుకు దిగినట్టు వారి ముఖాలే కాక, వాళ్లు తీసుకువచ్చిన వస్తువులే చాటేయి.

చెరొక ఇనప ట్రంకుపెట్టే కొన్నారు. అందులో చీరలూ, చాపులూ, పిల్లలకి బట్టలే కాక, మిఠాయి పొట్లాలు కూడా కొనిపెట్టేరు. చవగ్గా దొరికేయని, ఒక బస్తానిండా వంకాయలు కొన్నారు. పుల్లగుమ్మడికాయలు ఉత్తనే ఎవరో ఇచ్చారట, అవి మోసుకొచ్చేరు - వారి ముఖాలు గ్రహణం వదిలిన సూర్యుడిలాగా కనిపించేయి.

వారు రాగానే అమ్మ ఏమీ అడగలేదు. కాని, పిల్లలందరూ గ్రహించేరు ఇల్లు అమ్మకం అయిపోయినట్టు !

అమ్మ కాఫీ చేసి ఇచ్చింది.

నాన్నమ్మ ఎచ్చి కూర్చొని, "అయితే ఎంత కమ్మేసేరు ఇంతకీ ?" అని అడగ్గా, నాన్న ఏమీ అనలేదు. కాని, చిన్నాన్న చెప్పుకుపోయేరు.

"అమ్మా ! ఎక్కడ చూసినా ఇళ్ల ధరలు పెరిగిపోయినా, ఇది పాత ఇల్లు కాబట్టి, దీనిని విరిచి కొత్తది కట్టుకోవాలంటూ నాలుగు వేలనించి బేరం ప్రారంభించేరు. సభాపతి ఉండడం వల్లకాని, లేకపోతే ఆ ఆరువేలన్నా దొరక్కపోను !" అన్నారు.

నాన్నమ్మ ముక్కుమీద వేలు వేసుకుంది !

అమ్మ వెంటనే విరుచుకుపడింది ... "అన్న దమ్ములిద్దరూ వెళ్లి ఆరువేలకి ఇల్లమ్ముకు వచ్చేరా ? అంత కొంప మునిగిందేముంది ? ఇంటికి కొత్త పెంకు వేయించుంటే పదివేలకు అమ్ముడు పోను ! పెరట్లోని నుయ్యే చేస్తుంది వెయ్యి రూపాయలు !?" అమ్మ కంట తడిపెట్టుకుంది !

"తీరా వెళ్లిన తరవాత కార్యం పూర్తి చేసుకు రాకుండా వస్తే మీరు ఊరుకుంటారా ? సరేలే అమ్మలూ ! ఇల్లు ఎనిమిదివేల ఐదువందల కమ్మేం. వదినగార్ని కాస్త ఆటపట్టిద్దామనుకున్నాడు మనివి!" నాన్న ధీమాగా సిగరెట్టు ముట్టించేరు.

అమ్మ గలగలా నవ్వి, "అబ్బ ! బెంగపెట్టుకు చచ్చేను !" అంది.

భోజనాలయ్యేక ఇనపపెట్టె తెరిచేరు నాన్న. అందరూ పెట్టె చుట్టూ మూగేరు. తాను కొని తెచ్చిన బట్టలన్నీ బయటపెట్టేరు నాన్న.

"అయ్యో ! ఇంతకన్న మంచివి ఇక్కడున్నా యండీ !" అనబోయిందమ్మ

"అమ్మలూ ! నీదంతా మరీ ప్రాక్టికల్ అప్రోచ్ సుమా ! నా చిన్ననాటి స్నేహితుడు మాటూరి కనిపించి, "ఒరేయి కాశీ ! ఎంత కాలానిక్కనిపించేవ్‌రా ! రా ! బట్టలు తియ్యి ! నీకు ఇరవై శాతం కమీషనిస్తాను!" అంటూ వదలండే?" అంటూ చెప్పేరు నాన్న.

బట్టలు చూడడం అయింది. మిఠాయి పంపకమూ జరిగింది.

**జరిగిన కథ-5 :** చంప నాన్న కాశీపతి చాలీ చాలని జీతంతో ఆ ఇంటిని అలానే నెట్టుకొస్తున్నాడు. మధ్య తరగతి కుటుంబంలోఉండే చికాకులు, సమస్యలు ఆ ఇంట్లోనూ వున్నాయి చంప నాన్నమ్మకి వోపిక ఉన్నంత కాలమూ చాకిరీ చేయించుకొన్న కొడుకులూ, కూతుళ్ళూ ఆమెకు వోపిక తగ్గడంతో ఆమెను పోషించటానికి వంతులుపడ్డారు. చంప మామ అవధానివల్ల నాన్నకి ఏర్పడ్డ చిలుముగొట్టం అలవాటుతో అమ్మా, నాన్నల మధ్య వాదోపవాదాలు చెలరేగేవి. చంప అన్న రామంని కాలేజీలో చేర్పడానికి అమ్మ గాజులు అమ్మక తప్పలేదు. ఖర్చుల పెరగడంతో నాన్న సిగిరెట్లు మానివేయగా చంప బాధ పడుతుంది గతంలో తన కంపాస్ బాక్స్ దొంగిలించిన అప్పారావ్‌ని తన పుట్టినరోజు అని చెప్పి తన ఇంటికి నాన్న చెప్పగా ఆహ్వానిస్తుంది చంప అతను వెళ్ళింతర్వాత అలా దొంగిలించడం అతని తప్పు కాదని ఆ విషయంమీద ఓ లెక్చర్ ఇచ్చాడు నాన్న. గీతత్త అంటే రామానికి ఓ ప్రత్యేకమైన అభిమానం ఆమెకు అన్నీ వున్నా పిల్లలులేరు. నాన్న చెయ్యి చూసి నీకు ఇద్దరు పిల్లలున్నారని చెప్పగా, ఆమె ముఖం వికసించేది. శ్రీనుమీద ప్రేమ కురిపించే చిన్నాన్న పార్వతీపురంలో ఉన్న ఇల్లు అమ్మేసి తన భాగం డబ్బు తనకు పంపమని ఉత్తరం వ్రాస్తాడు నాన్నకు. అమ్మ ఆలోచించి ఆ ఇల్లుఅమ్మటానికే నిశ్చయించుకొంటుంది నాన్నతో సంప్రదించినమీదట.

అదయ్యాక డబ్బుని పైకి తీసేరు నాన్న. కొత్త వంద రూపాయల నోట్లని, అందరూ నోళ్లు వెళ్లబుచ్చి చూస్తూ ఉండగా గొప్పగా లెక్క పెట్టేరు నాన్న. రిజిస్ట్రేషన్ ఖర్చులు తమే భరించవలసి వచ్చిందిట – బట్టలకీ వాటికీ చెరో రెండొందలూ ఖర్చు.

ఏడు వేల ఐదు వందలనీ నాలుగు భాగాలు చేసేరు తెలివిగా. ఎనిమిది వేలని భాగాలు వెయ్యరేం అని అమ్మ అడగలేదు! మూడో తమ్ముడికి ఓ రెండొందలు తక్కువ వెళ్తే వచ్చిన నష్టం ఏముంది? వాడికదో లెక్క కాదు! వాటాకి పద్దెనిమిది వంద లొచ్చింది.

నాన్నమ్మకి ఆమె వాటా ఇచ్చేరు. "అమ్మా! ఇంద! నీ వాటా!" అంటూ.

నాన్నమ్మ ఆ డబ్బుని ప్రేమగా తడిమింది –

"నా కెందుకురా ఈ సొమ్ము? నీ దగ్గరుంచు కాశీ!" అంది

"మా దగ్గరుంటే ఖర్చయిపోతుందమ్మా!"

"అయితే ఏం చెయ్యమన్నావు?"

నాన్న చెప్పేరు. ఆ డబ్బు వడ్డీకి ఇవ్వదలచుకున్నట్టు – ఆ వచ్చే నెలనెలా వడ్డీ డబ్బుని నాన్నమ్మ కివ్వదలచుకున్నట్టూ.

"సరే! నీ ఇష్టం!" అంది నాన్నమ్మ

వడ్డీకిస్తే వెయ్యికీ నెలకీ ఇరవై రూపాయలిస్తారు. రెండు వేలకీ నలభై వస్తుంది. చిన్నాన్న, "ఆ ఇమ్మిడి సెట్టిని నమ్మొచ్చా?" అని అడిగేరు

"వాళ్లకేం – లక్షలకి లక్షలూ వడ్డీలకి తిప్పుతున్నారు" అన్నారు నాన్న. "ప్రోనోటు రాసిస్తారు. మనం ఇద్దరం వెళ్లి డబ్బు ఇచ్చి వద్దాం..."

"నాకు రెండుపేటల గొలుసు, పలకల గాజులు చేయించండే వేసొప్పుకోను!" అని మారాం చేసిందమ్మ

"ఓ! దానికేం! అలానే చేయిద్దాం!" అన్నారు నాన్న, ఎందుకిప్పుడు వాదనలోకి దిగాలి అని.

"పోనీ! నా డబ్బులోంచి ముగ్గురు కోడళ్లకీ గాజుల కని చెరో మూడొందలూ ఇవ్వరా కాశీ!" అంది నాన్నమ్మ ఎంతో ప్రేమగా. నాన్నమ్మకి డబ్బు కన్న ముఖ్యమైనది ఆప్యాయత, మమకారం– ఆమె తనకున్నది ఇతరులకి ఇవ్వడమే తప్ప పుచ్చుకోడం ఏనాడూ ఎరగదు

ఆ మాటలకి అమ్మ చలించిపోయి నాన్నమ్మని పెనవేసుకుంది. "అత్తయ్యా! మీ మనసు వంటి వెన్నవంటి మనసుని దేవుడు అందరికీ ఇస్తే ఎంత బాగుణ్ణు!" అంది.



కాని నాన్న ఒప్పుకోలేదు. "అమ్మ డబ్బులోంచి పగాణీ అన్నా ముట్టుకుందుకి వీల్లేదు..." అంటూ బ్రేక్ కొట్టేరు. "ఎవరి వాటాలోంచి వాళ్ళు నగలు చేయించుకుంటారో, బట్టలే కొన్నుక్కుంటారో వాళ్ళ ఇష్టం!" అన్నారు.

"పోనీ కాశీ! పిల్లల చేతిలో నే పెట్టేనట్టు మన వాళ్ళందరికీ చెరో పాతికా మనియార్డర్ వెయ్యవా?" అంది నాన్నమ్మ... కూతుళ్ళని దృష్టిలో ఉంచుకొని.

"సరేలేమ్మా!" అన్నారు నాన్న.

## 15

ఇల్లు అమ్మగా వచ్చిన తన వాటా పద్దెనిమిది వందలూ నిలవ ఉండలేదు. ఏడాది కాలంలో ఇంటి ఖర్చులకి సరిపోయింది. డబ్బు లేనప్పుడు ఏ ఖర్చులూ కనిపించవు. డబ్బు చేతిలో ఆడగానే ఆ డబ్బుకి తగ్గట్టు అవసరాలూ ఎదురౌతాయి.

నాన్న అందరికీ కొత్త బట్టలు కుట్టించేరు. అమ్మేమొ తన నగలన్నీ చెరిపించేసి, వాటిమీద మరో రెండు తులాల బంగారం కొని, కలిపి, చేతులకి గాజులు, మెడలోకి చంద్రహారాలూ చేయించుకుంది.

చంపాకి చెవులకి జూకాలూ, ఒంటిపేట గొలుసూ, చేతులకి పంకల మురుగులూ చేయించడం అయింది. అందుకు రెండు తులాల బంగారం. ఆ రోజుల్లో తులం బంగారం రెండొందలు కాబట్టి, మజూరీతో కలుపుకొని తొమ్మిదివందలు మొత్తం ఖర్చు, అమ్మకీ, చంపకీ కలిపి.

మిగిలిన సొమ్ము పోస్టాఫీసు సేవింగ్స్‌లో వేసేరు.

## స్పందన

కాని నెలకి రెండుసార్లు విత్‌డ్రాయల్ ఫారమ్‌లు తెచ్చి ఆ డబ్బు తియ్యడమే జరిగేది పాతికా, ముప్ఫయ్యా చొప్పున. ఎవరో బంధువులు అలా వస్తూనే ఉండేవారు. వారు వెళ్ళేటప్పుడు చీరా, చాపూ పెట్టవల్సి వచ్చేది.

ఇంతేకాక, ఇల్లు అమ్మినట్టూ, రెండువేల వరకూ భాగం వచ్చినట్టూ ఊరిలోని బంధువు లందరికీ తెలియడం వల్ల, వాళ్ళకి పదీ, పాతికా అవసరం పడితే నాన్న దగ్గరికి అప్పుకోసం వచ్చే వారు. నాన్నకి మొహమాటం — లేదని అనలేరు. తీసుకువెళ్ళిన డబ్బు మారి ఎప్పుడూ తిరిగి వచ్చేది కాదు. తీసుకువెళ్ళేటప్పుడు, తిరిగి ఇచ్చే ఉద్దేశం అసలు ఉండేదేకాదు వాళ్ళకి.

ఇదిలా ఉండగా నాన్నమ్మకి జబ్బు చేసింది ఎప్పుడూలేంది. మంచం దిగలేకపోయింది. చచ్చి పోతుందనుకున్నారందరూ. దాంతో ముసల్ది చచ్చే సమయానికి ఉందామని ఊళ్ళో ఉన్న బంధువులంతా వచ్చి ఇంట్లో తిష్టవేసేరు. వంటలూ, వార్పులూ, తిళ్ళూ! ఎవరి పనులకి వారు పోయినా తిండికి మాత్రం ఇక్కడికి వచ్చేసేవారు. వారంరోజులలోనూ ఒక అరబస్తా బియ్యం ఖర్చయింది. ఎవరూ లేనప్పుడు గుట్టుగా చారూ, అన్నం తినివచ్చు. కాని బంధువులున్నప్పుడు ఏదో ఓ కూర, పులుసు ఉండాలి కదా?

చచ్చిపోతుందనుకున్న నాన్నమ్మ కోలుకుంది. యమకింకరులకి ఆమెను చూసి భయం వేసినట్టుంది! వారం తిరక్కుండా లేచి కూర్చొని, మాతిదగ్గర చన్నీళ్ళ స్నానం చేసేసి వంటపని ప్రారంభించేసింది వద్దంటున్నా. ఊరికే కూర్చొని తినడం ఆమెకి చేతకాదు. ఎన్నడూ రాని జ్వరం తనకు వచ్చి నందుకు సిగ్గుపడింది. ఏకంగ చచ్చిపోనందుకు దేవుణ్ని దుయ్యబట్టింది.

ఈ వారం దినాల్లోనూ నాన్నకి రెండొందలు ఖర్చు!

అనకాపల్లినించి చిన్నాన్నా, పిన్నీ, వచ్చేసేరు. ఉత్తరం రాయకపోయినా, కబురు తెలిసి వచ్చేసేరు! చిన్నాన్నకీ అతడి కుటుంబానికీ బస్సుల్లో ఫ్రీ! తాలూకాఫీసులో పనికదా మరి? చిన్నాన్నకి మొహ మాటం, చిన్నతనం అనిపించటం లేవు. ఎవరో ఒక సబ్ ఇన్‌స్పెక్టర్‌ని పడతారు — లేదా బస్ కండక్టర్‌తో "నేను తాలూకాఫీసులో క్లర్కుని. మీ ఓనరు నా దగ్గరికి వస్తూ ఉంటాడు" అంటూ కబుర్లు చెప్తారు. అప్పటికీ లొంగకపోతే పోలీసు సాయం తీసుకుంటారు. అలానే ఎవరన్నా అతడి దగ్గరికి వెళ్ళి పని చేసిపెట్టమంటే, ఆ పని చేసి పెట్టి, "మరి నా సంగతేమంటారు?" అంటూ నిర్మొహమాటంగా డబ్బడిగి పుచ్చుకొనేవారు. ఆ రోజుల్లో విజిలెన్సు డిపార్ట్‌మెంట్లూ, ఏంటీ కరప్షన్ డిపార్ట్‌మెంట్లూ ఉండేవి కావు. "ఏమయ్యా? ఎక్కడ పనిచేస్తున్నావ్?" అని అడుగుతే, "ఫలానా ఆఫీసులో!" అని చెప్పగానే... "పైన కస్సీ ఏమన్నా దొరుకుతుందా? కడిగేసిన

ఇంకా ఎక్కువ ఇంధనము పొదుపు చేయండి !

# నిమిషాలలో వంటంతా చెయ్యండి





**అన్నం, పప్పు, కూరలు—ఒక్కసారే!**

ప్రెస్టీజ్ వాడడం వల్ల దాని లోపలి గిన్నెలలో అన్నం, పప్పు, కూరలు మీరు ఒకే సమయంలో వండుకోవచ్చును సాధారణంగా ప్రెషర్ కుకర్‌లో వంటకు పట్టే సమయం 15–20 నిమిషాలకన్న మించదు ఆపైన తాలింపులకు మరో కొద్ది నిమిషాలు, అంతే మీ వంటంతా సిద్ధమయినట్లె



**ఎక్కువ వండే చోటు కోసం మరింత పెద్ద గిన్నెలు!**

కాని, గిన్నెలు వాడడం వల్ల వంటకు కావల్సిన చోటు మరి బాగా తగ్గి పోదా? ప్రెస్టీజ్ వల్ల అలా జరగదు! కుకర్ ఎంత విశాలంగా ఉందో, ఇంచుమించుగా అంత విశాలంలోనూ, గిన్నెలు పట్టేలా ప్రెస్టీజ్ డిజైన్ చేయబడింది అందుకే అదే సైజుగల ఇతర డిజైన్ల కుకర్‌ల కన్న ప్రెస్టీజ్, గిన్నెల కోసం మరింత చోటు సమకూరుస్తుంది మీ అంతట మీరే చూసి తెలుసుకోండి



**ఎలక్ట్రిసిటి, గ్యాస్, కిరసనాయిల్, బొగ్గులు—పొదుపు చేయండి!**

కిరసనాయిల్ లేక బొగ్గులు, ఎలక్ట్రిసిటి లేక గ్యాస్ పైనగాని ప్రెస్టీజ్‌తో అంతే నేర్పుగ వండవచ్చును ఇది వంటకు పట్టే సమయాన్ని బాగా తగ్గిస్తుంది కనుక ఇంధనము ఖర్చులో పొదుపు అటు డబ్బు, ఇటు సమయం కూడా పొదుపు చేయును

## గిన్నెల కోసం ఎంత ఎక్కువ చోటు?

ప్రెస్టీజ్ కుకర్‌ని మీ అంతట మీరే చూసి తెలుసుకోండి అదే సైజులు గల ఇతర డిజైన్ల ప్రెషర్-కుకర్‌లతో పోల్చి చూసుకోండి ప్రెస్టీజ్ "ప్రీత్ 65" మోడల్‌లో గిన్నెల కోసం 51% ఎక్కువ చోటు దొరుకును ప్రెస్టీజ్ "ఎలిగెంట్"లో అయితే 101% ఎక్కువ చోటు గిన్నెల కోసం ఒకే సమయంలో పూర్తి వంటంతా చేసుకొనేందుకు ప్రెస్టీజ్‌ని మించిన ప్రెషర్ కుకర్ లేదు

**ఉచితం!** "నిమిషాలలో వంటంతా చెయ్యండి" వివరాల పుస్తకము.

ఈ పుస్తకము కోసం, కన్స్యూమర్ సర్వీస్ మేనేజర్, ప్రెస్టీజ్ నేషనల్ సర్వీస్ సెంటర్, టిటి (ప్రైవేట్) లిమిటెడ్, దూరవాణి నగర్, బెంగుళూరు 560 016 ఈ చిరునామాకు వ్రాయండి

**Prestige**

MCA-TT 55-Tel

జీతం రాళ్లేనా ?'' 'ఆఁ ఎదో వేణ్ణిళ్లకి న్నీళ్ళ !'' అంటూ దొరికే లంచాల గురించి బాహాటంగ చర్చించుకోడం రివాజా!

*　　　*　　　*

ఇక్కడకి ఖర్చు చాలు దేవుడా! అని ఊపిరి అనుకొనేసరికి చంపా పితూరీ చేసింది! ఇదెప్పుడు ఆ పని చేస్తుందా అని ఎదురు చూస్తున్న బంధు

## స్పందన

వర్గానికి విరాళ కలిగించకుండా పెద్దమనిషయి కూర్చుంది!

''ఏమండోయ్! అలా వెళ్లి కాస్త మన వాళ్లందర్నీ కేక పెట్టండి!'' అంది ఓ రోజు ఉదయం అమ్మ గాభరాపడుతూ

''ఏం కొంప మునిగింది?'' నాన్న వరండాలోంచి

అమ్మ నాన్న దగ్గరికి వెళ్లి ముసి ముసి నవ్వులు నవ్వుతూ ''మీ ముద్దుల కూతురు '' అంది తక్కింది గ్రహించుకోమన్నట్టు

నాన్న ముఖం పాలిపోయింది కూతురు ఎదిగిందనేసరికి ఏ తండ్రయినా పదేళ్ల ముసలాడయిపోయి

ఎట్టు అనుభూతి పొందుతాడు ! ఓ పెద్ద బరువు నెత్తిన పడింది ! నాన్న ఏమీ అనలేదు — చేతిలో ఉన్న సిగరెట్టు విసిరేసి, మరో సిగరెట్టు ముట్టించేరు —

''ఆడవాళ్ల వ్యవహారంలో నన్నిరికించకు ! ఆ పిలుపులూ అవీ నువ్వే చూసుకో !'' చిరాగ్గా అన్నారు.

''పోస్టాఫీసుకి వెళ్లి ఓ వంద తియ్యండి పోనీ!''

''ఎందుకు ?''

''ఎందుకేమిటండీ ? ఇది మరీ చోద్యమమ్మా! రెండు స్వీట్లూ, ఓ కారం చెయ్యాలాయె! ... ఇంకా బట్టలు .. '' అమ్మ చెప్పక వెళ్లిపోతోంది.

నాన్న లేచి వీధిలోకి వెళ్లిపోయేరు.

''ఒరే శ్రీనూ నువ్వెళ్లి బుచ్చి అత్తని పిలుచుకరా ! అలా నే వెళ్లి పెద్దత్తని పిలుచుకొస్తాను'' అమ్మ.

''ఇన్ని పనులు నేను చెయ్యలేనే ! రామిగాడి కూడా చెప్పు !''

''ఇవాళ బడికి వెళ్లకు ! చాలా పనులున్నాయి! ఈ పావలా ఉంచుకో !'' అడ్డుచెప్తే విరుచుకు పడే అమ్మ ఇవాళ పావలా లంచం ఇవ్వడంతో శ్రీను ఆనందంతో ఎగిరి గెంతేసి పరుగులు తీసేడు

చిమ్మిలేకాక, లడ్డుండలు, మైసూర్‌పాక్, మిక్చర్ ఇవన్నీ తయారుచేయించి, సంచులలో వేసి, వచ్చిన ముత్తయిదువులందరికీ పంచడం జరిగింది. వంటలూ, భోజనాలూ, ఆఖరి రోజున విందు భోజనం ! పిల్లకి కొత్తబట్టలు ... ఇవన్నీ అయ్యే సరికి మూడు వందలు ఆరిపోయింది !

''ఏ క్షణాన ఆ ఇల్లు అమ్మేనో కాని, ఈ ఖర్చులన్నీ వచ్చిపడ్డాయి. ఉన్నవాడికే మరింత డబ్బు! లేనివాడికి మరింత ఖర్చు! ఎక్కడ్నించవన్నా డబ్బొస్తే నీళ్లల్లా ఖర్చయిపోయి ఊర్చుపాటయి పోయేవరకూ ఖర్చులు అలా వచ్చి పడుతూనే ఉంటాయి !'' అంటూ జాతకం వేదాంతం చెప్పేరు నాన్న!

''ఆ డబ్బుంది కాబట్టి ఈ ఖర్చులు తట్టుకో గలిగాం! లేకుంటే ఏం చేసుందుం?'' అమ్మ అంది.

''ఖర్చులే ఉండకపోను ! ఉన్నదాంట్లోంచే సర్దుకొని ఉందుం !''

* * *

రాముం కాలేజీలో చేరడం, చంపా పెద్దమనిషి అవడం, శ్రీను మెట్రిక్‌కి రావడం, ఇవన్నీ జరిగేక ఆ సంసారం పెద్దయిన దిగువ మధ్య తరగతి మనిషి కాశీపతి జీవితంలో ఒక అధ్యాయం ముగిసి మరో అధ్యాయం ప్రారంభమయింది.

నిజంగా నేను ముసలాడ్నే అయిపోయేను అనుకున్నాడు కాశీపతి, ముసలాడు కాకుండానే—మనసుకి ముసలితనం వచ్చేసినట్టయింది.

ఇల్లమ్మగా వచ్చిన సొమ్మంతా ఖర్చయిపోగా మిగిలిన సొమ్మేదో ఎందుకు ఖర్చవకూడదు, అన్నట్టు చెప్పా పెట్టక, నాన్నమ్మ శాశ్వతంగా కళ్లు మూసేసింది !

## 16

చంపా ఏడ్చింది — కంటికీ మింటికీ ఏకంగా ఏడ్చింది.

ఏనాడూ జబ్బూ, జ్వరమూ, జలుబూ ఎరగని నాన్నమ్మ నిద్రలో చచ్చిపోయింది !

తెల్లవారకుండానే ఎప్పుడూ లేచిపోయే నాన్నమ్మ లేవకపోవడంలో చంపా వెళ్లి ఆమెని కుదిపింది. ''నాన్నమ్మా! లే! ఒంట్లో బాగోలేదా?''

కాని నాన్నమ్మ ఒళ్లు కట్టెలా తగిలింది ఆమె ముఖం చూడగానే భయం వేసి అమ్మనీ, నాన్ననీ పిలుచుక వచ్చింది.

నాన్న ఇటూ అటూ నాన్నమ్మ శరీరాన్ని కదిపి, ''అమ్మ చచ్చిపోయింది !'' అన్నారు ముఖంలో ఎంతో ఆవేదనతో.

అమ్మ గొల్లుమంది. ఇల్లు ఎగిరిపోయేలా రాగాలు తియ్యడం ప్రారంభించింది. ఆమె ఏడుపు విని ఇరుగు పొరుగు వారంతా పరుగున వచ్చేరు. ఎలా మరి కబురు వెళ్లిందో కాని ఊళ్లోని దగ్గరా, దూరం బంధువులంతా వచ్చేరు. ఇద్దరు తమ్ముళ్లకీ నాన్న టెలిగ్రాం ఇవ్వడంతో వాళ్లు వెంటనే వచ్చి, దిన వారాలయ్యే వరకూ ఉన్నారు.

ఇంతమంది ఉన్నా ఎవ్వరూ లేనట్టే అనిపించింది చంపాకి. వీళ్లెవ్వరూ తనకి ఏమీకారు, పేరుకి బంధువులే కాని ! తనకి చేరువైనదీ, తన మీద నిత్యం అనురాగం కురిపించే నాన్నమ్మ తన

త్వరలో

రాగబంధితులు

సీరియల్

కింక లేదు ! బతికున్నన్నాళ్లూ అందరికీ సేవలు చేసింది — ఆఖరి దశలో ఆమె ఒంట్లోని సత్తువ తగ్గిపోగానే ఆమె మరి ఎవరికీ అవసరం లేక పోయింది. ఆఖరికి ఆమె ముగ్గురు కొడుకులూ ఆమె ఎవరి దగ్గర ఉండేదీ అన్న అంశమ్మీద ఘర్షణపడ్డారు వాళ్లకీ ముసలి కాలం రాదా ? తెలిసిరాదా ?

దిన వారాలయ్యేక వచ్చిన బంధువులు వెళ్లి పోయేరు. ఇల్లు వెలవెలబోయింది ఎప్పుడూ నాన్నమ్మ గురించి ఆలోచనలే వచ్చేవామెకి. ఏ ఏ సందర్భాలలో ఆమె తన పక్షం వహించిందీ ఎప్పుడెప్పుడు తనకోసం తినుబండారాలు దాచిపెట్టి తననే ప్రత్యేకంగా పిలిచి ఇచ్చిందీ, ఇవన్నీ గుర్తుకు తెచ్చుకొనేది ఒంటరిగా కన్నీరు కార్చేది. అటువంటి సమయాల్లో చావు గురించి ఆలోచించేది — నాన్నమ్మ స్వర్గంలో ఎక్కడో ఉందా ? మరి ఆమె శరీరం ఇక్కడ బూడిదగా మారి పోయిందే ? తను ఆమెతో మాట్లాడ్డానికి వీలౌతుందా ? ముక్కాలు పీట తీసుకొని, చచ్చిపోయిన వాళ్ల ఆత్మలని పిలిచే ఆట ఒకటి ఆడేవారు దానిమీద వ్రేళ్లుంచి. అదంతా ఒక ఆట అనుకొనేది . నిజంగా నమ్మేది కాదు. నాన్నమ్మ ఆత్మని పిలుస్తే ... కలల్లో ఎన్నోసార్లు ఆమె అగపడేది .. తనని పలకరించేది ... ''నిన్న రాత్రి నాన్నమ్మ నాకు కలలో కనిపించింది నాన్నా!'' అనడం ఇంట్లో చంపకీ, శ్రీనుకీ, రామునికీ అలవాటయిపోయింది ! అంతగా ఆమె వ్యక్తిత్వం వారి బతుకులతో ముడివేసుకపోయింది.

* * *

ఇల్లు కదిలి, బయటకు వెళ్లి, ఇదివరకులా ఆడుకుందుకి మరి వీలులేకుండా ఉంది చంపకి. గౌన్లు పోయి, పరికిణీ జాకెట్టు, వోణీ వచ్చేయి. తన వ్యక్తిత్వమే పూర్తిగా మారిపోయినట్టనిపించింది. లోకమంతా తనని మరి చిన్నపిల్లలా చూడకపోవడం ఆమెకు కష్టంగానే ఉంది. తనతో ఆడుకొనే మగపిల్లలంతా ఇంకా చిన్నపిల్లల్లానే తిరుగుతున్నారు . రోడ్లమీద ఆడుకుంటూ పరుగెడుతున్నారు — ఇది ఎంతో అన్యాయం అనిపించింది.

స్కూలుకి వెళ్లిరావడం . అమ్మకి పనిలో సాయం చెయ్యడం...పుస్తకాలు ముందు పడేసుకొని చదువుకోడం . ఇదీ నిత్య చర్య.

అమ్మకి తన పెళ్లి గురించి ఇప్పట్నించీ బెంగ పట్టుకుంది. ''ఏమండీ ! చంపాకి సంబంధాలు చూడండీ !'' అంటూ నాన్నతో రోజూ పోరేది

''ఇప్పట్నించి దానికేం సంబంధాలే ? పద్దెనిమిదీరాందే పెళ్లేమిటదానికి?''అనేవారు నాన్న.

''అదేమిటా మాట ? నాకూ, మీకూ ఎప్పుడు పెళ్లయింది ? మన పెళ్లికి నాకు పదమూడేళ్లు!''

''ఆ కాలం వేరు . ఈ కాలం వేరు — ఆ కాలంలో పదమూడేళ్లకు ఆడదానికి పెళ్లి అయ్యేది— ఇరవై ఏళ్లకి ఐదుగురో, ఆరుగురో పిల్లల్ని కని ముసల్దీ అయిపోయేది ''

''అలా అని ఎదిగిన పిల్లని ఇంట్లో పెట్టుక కూర్చుంటామండీ ?''

''ఆ కాలంలో ఇంట్లో ఆడపిల్ల పుడితే డబ్బు మూట ఒళ్లో పడ్డట్టే ! కన్యాదాత కట్నం పుచ్చుకొనేవాడు ! ఈ కాలంలో కథ తారుమారయింది!''

''ఇప్పుడు వెతకడం ప్రారంభిస్తే, వెతగ్గా, వెతగ్గా ఏడాదో, రెండేళ్లో తరవాత సంబంధం స్థిరపడొచ్చు !'' అమ్మ.

''ముందు దాన్ని మెట్రిక్ పాసు కానీ! ఇవాళా రేపూ పెళ్లికూతురు కనీస యోగ్యత మెట్రిక్ — అంతేకాక పెళ్లికి డబ్బు కూడా నిలవెయ్యొద్దా ? కనీసం ఐదువేలు కట్నం . పెళ్లి ఖర్చులు మరో మూడు, నాలుగువేల !''

ఇలా తన పెళ్లి గురించి చర్చలు జరిగినప్పుడు చంపకి తాను ఆడదై పుట్టి అమ్మకీ, నాన్నకీ చాలా ఇబ్బంది కలిగించిందే అనిపించేది.

రామునికీ, శ్రీనుకీ ఆ బాధలేదు ! వాళ్లు ఎంతవరకన్నా చదువుకోవచ్చు. ఇష్టముంటే పెళ్లి చేసుకోవచ్చు, లేకుంటే మానవచ్చు ! ఎంత వయసు మీదపడ్డా ఫరవాలేదు.

స్కూలునించి వచ్చిసేక సాయంత్రం తన ఈడు పిల్లలతో కబుర్లు చెప్పుకుందుకీ, కథలు చెప్పుకుందుకీ, ఆడుకుందుకీ ఇల్లు కదిలి వెళ్లడానికి మొదట్లో కొన్ని ఆంక్షలు పెట్టినా, తరవాత తరవాత అమ్మ అడ్డుపెట్టడం తగ్గించింది. ''చీకటి పడకుండా వచ్చీ !'' అని మాత్రం అనేది.

(ఇంకా ఉంది)

# సినిమా విశేషాలు -జి. వి. జి.



'దీపారాధన' లో జయప్రద

## పండంటి జీవితంలో అలూ మగల అలుక !

శేఖర్ (శోభన్‌బాబు) భార్యను పిలుస్తూ, గదిలోకి వచ్చాడు. సంధ్య (సుజాత) "ఈ నెక్లెస్ ఎలా ఉందండీ ?" అడిగింది.

"బాగుంది ... అవునూ — బ్రీఫ్‌కేసులో పెట్టిన డబ్బేమైనా తీశావా ?" శేఖర్ అడిగాడు.

"తీశాను. అది పెట్టేగా ఈ నెక్లెస్ కొన్నాను ?"

"వాట్ ? అది ఆఫీసు డబ్బు. బాంబే పార్టీకి ఇవ్వాల్సి తీసుకొచ్చి ఉంచాను. నీకు కావాలిస్తే, మీ డాడీని అడుగు. బ్యాంక్ నుంచి తెచ్చుకో. ఖర్చు చేసుకో !"

"అడిగే అలవాటు లేదు; అవసరమూ లేదు. అయినా, ఇంత చిన్న విషయానికి మీరెందుకంత గొంతు చించుకుంటున్నారో నా కర్థం కావడంలేదు."

శేఖర్ మరింత రెచ్చిపోయాడు. "నోర్మూయ్! చేసిన వెధవపని చాలక — ఇంకా ఎందుకా బుకాయింపు ?"

అక్కడికి సంధ్య తండ్రి పురుషోత్తమరావు వస్తూ, "వాట్ హేపెండ్ ? ఏమిటి హాట్ హాట్‌గా సరసాలాడుకుంటున్నారు ?" అన్నాడు.

సంధ్య : చూడు, డాడీ ! నేనీ నెక్లెస్ కొనుక్కోవాలనుకున్నాను. బ్రీఫ్‌కేసులో డబ్బు తీసుకెళ్లి కొనుక్కున్నాను. తప్పా ?

పురు : తప్పుకాదే !

శేఖ : నాతో చెప్పకుండా తీయడం —

పురు : తప్పే !

సంధ్య : నా డబ్బు నేను ఖర్చు చెయ్యడం తప్పా, డాడీ ?

పురు : తప్పేముందమ్మా ?

శేఖ : నేను తెచ్చిపెట్టిన ఆఫీసు డబ్బు ఖర్చు చెయ్యడం —

పురు : ఇది తప్పే ... చూడండి ! ఇద్దరి కేసుల్లో స్ట్రాంగ్ పాయింట్ ఉంది. కాని, వీక్ పాయింట్ కూడా ఉంది. కూల్ డౌన్ !

శేఖ : ఏమిటి, సార్, మీరు ? అన్నీ తెలిసిన మీరే సంధ్యను సమర్థిస్తారు ?

పురు : అదేనయ్యా నా వీక్ పాయింటు. తల్లి ప్రేమకు నోచుకోని దురదృష్టాన్ని కప్పిపుచ్చటానికి అమ్మాయి ఏమడిగినా ఇచ్చాను. ఏం చేసినా భరించాను. అందుకే ఇలా తయారైంది. చూడు, బాబూ ! నువ్వు సంధ్యకు భర్తవే కాదు; అప్పుడప్పుడు తండ్రి కూడా కావాలి. అమ్మాయి మాటలకు నువ్వే ఆవేశపడితే, ఇంకెవరు దాన్ని అర్థం చేసుకుంటారు ?

శేఖ : అయామ్ సారీ, సార్ !

పురు : నిజంగా నీలాంటి భర్త దొరకడం సంధ్య అదృష్టం, బాబూ !

తాతినేని రామారావు దర్శకత్వంలో మిద్దే రామారావు నిర్మించే శ్రీ రాజలక్ష్మి ఆర్ట్ పిక్చర్స్ "పండంటి జీవితం" చిత్రానికి భీశెట్టి కథకుడు. గొల్లపూడి సంభాషణలకర్త. చక్రవర్తి సంగీత దర్శకుడు. పి. విశ్వం సహకార దర్శకుడు. వెంకటేశ్వరరావు, బెనర్జీ సహాయ దర్శకులు

## ప్రసన్నలక్ష్మి ప్రొడక్షన్స్ రాజా చిత్రం

"బోయిన సుబ్బారావు స్క్రీన్‌ప్లే, దర్శకత్వంలో కొత్త చిత్రాన్ని మొదలెట్టబోతున్నాను," అన్నారు లోగడ "కొత్త కాపురం, ముత్తయిదువ" చిత్రాలను నిర్మించిన గంగూరి వెంకటరత్నం. కృష్ణ, శ్రీదేవి, గిరిబాబు, నూతన్‌ప్రసాద్, రావు గోపాలరావు, మమత, పండరీబాయి, కొత్త నటుడు కె. నాగేశ్వరరావు పాత్రధారులు. బాలమురుగన్ కథకుడు. మహదేవన్ సంగీత దర్శకుడు. పి. విశ్వనాథ్ రాయ్ ఛాయాగ్రాహకుడు.

## ప్రేమనక్షత్రం

డాక్టర్ కొమ్మూరి వేణుగోపాలరావు నవల "ప్రేమనక్షత్రం"ను కృష్ణ హీరోగా హేమా ఇంటర్నేషనల్ వారు కొత్త సంవత్సరంలో తెరకెక్కించబోతున్నారు. లోగడ టైగర్ ప్రొడక్షన్స్ సంస్థలో భాగస్థుడైన ఎస్. హెచ్. హుస్సేన్ సమర్పణలో పి. సాంబశివరావు దర్శకత్వం వహించే ఈ చిత్రానికి కె. బుజ్జిరెడ్డి, పి. సురేంద్రరెడ్డి, పి. రాధారెడ్డి, ఎం. జనార్దనరెడ్డి నిర్మాతలు. వి. ఎస్. ఆర్. స్వామి ఛాయాగ్రాహకుడు.

... కారంగ ... త ... య్యం
... 000 మం ... యుల్ని చేస్తున్న
సంచ ... వారపత్రిక

# జ్యోతిచిత్ర

తనివినీ ఎరుగని
రీతిలో
కమనీయమైన
వార్తలతో
కన్నుల కింపైన వర్ణ
చిత్రాలతో
కవ్వించి నవ్వించే
సెట్స్‌పై కబుర్లతో
ముచ్చట గొలిపే
తారల ముచ్చట్లతో
ఇంటింటా
తారాతోరణంగా
వెలువడుతున్న



అనన్య ప్రచా ... గిన తెలుగు ... వారపత్రిక

## సినిమా

### డైరెక్టరవడానికి ముందు భారతీరాజా!

ఎస్. ఎస్. ఎల్. సి చదివాక కొంతకాలం పాటు ఉద్యోగాన్వేషణచేసి, హెల్త్ డిపార్ట్‌మెంట్‌లో ఇంటింటికీ వెళ్లి టీకాలువేసే ఉద్యోగంలో చేరారు. అదినచ్చక రాజీనామాచేసి, మద్రాసు చేరుకున్నారు. వాహినీ స్టూడియో ఎదుట నాగిరెడ్డిగారి యాజమాన్యంలో ఉన్న పెట్రోల్ బంక్‌లో పెట్రోల్ పోసే ఉద్యోగం దొరికింది అక్కడి మేనేజరు "నువ్వు టిప్‌టాప్‌గా డ్రస్ చేసుకొని వస్తావు. బట్టలన్నీ మురికి అయిపోతాయి నీలాంటి వారిక్కడ పనిచేయడం కష్టం. వేరే మంచి ఉద్యోగమేదైనా చూసుకోరాదూ?" అని సలహా ఇచ్చాడు. "బట్టలు మలినమైనా ఫర్వాలేదు ఏదో ఒక ఉద్యోగం దొరికింది అంతేచాలు!" అన్నాడు భారతీరాజా. కాని పెట్రోల్‌వాసన భరించలేక పోయాడు డోకులు రాసాగాయి. సంవత్సరం తర్వాత మౌంట్‌రోడ్‌లోని 'పయొనీర్ మోటార్ కంపెనీ' అనే కార్ల విడిభాగాలు విక్రయించే షాపులో బిల్ క్లర్క్‌పని దొరికింది ఆ యాంత్రికమైన జీవితానికి విసుగుపుట్టింది నాటకంలాంటి ఏదైనా సృజనాత్మక కళలో ప్రవేశించాలనే తపనపట్టుకుంది. ఆ ఆలోచనల్లో 5 వందల రూపాయల బిల్లుకు 5వేల బిల్లు చేయడంలాంటి పొరబాట్లు దొర్లిపోయాయి "వేరేపని ఏదైనాచూసుకో, నాయనా!" అని వాళ్ళు పంపించేశారు. అప్పుడు ఈయన నేస్తం ఇళయరాజా, జి. కె. వెంకటేశ్ మ్యూజిక్ ట్రూప్‌లో ఉండేవాడు. వెంకటేశ్ ధర్మమా అని సుప్రసిద్ధ కన్నడ దర్శకుడు పుట్టన్నతో పరిచయం ఏర్పడింది సహాయ దర్శకుడిగా చేరి, చివరికి దర్శకుడయ్యాడు. ఈయన దర్శకత్వం నెరపిన "కొత్త జీవితాలు" చిత్రం త్వరలో విడుదలవుతుంది.

# సినిమా



'పులిబిడ్డ' లో శ్రీదేవి, జానకి

## మానవుడు – మహనీయుడులో మాత్రలు కొన్న మగువ !

సుధ (సుశీల) ఒక మందుల కొట్టుకు వెళ్లి, ఒక పాతిక గార్డినాల్ టాబ్లెట్లు అడిగింది.

"పాతికా!" కొట్టతను ఉలిక్కిపడ్డాడు "ఊఁ ... ప్రిస్క్రిప్షన్ ఇవ్వండి."

"ప్రిస్క్రిప్షన్ ఏమైంది ?" సుధ హేండ్ బ్యాగ్ వెతికినట్లు నటించింది "సారీ, సార్! ఎక్కడో పారేసుకున్నాను."

"ప్రిస్క్రిప్షన్ లేందే నిద్రమాత్రలు ఇవ్వటానికి వీల్లేదు."

"ప్లీస్ ! మా అమ్మమ్మకి కీళ్ళవాతం అండీ. రాత్రిపూట అసలు నిద్రపోదు. ఒకటే మూలుగు. నా చదువంతా పాడయిపోతుంది, సార్...ఒట్టు!"

హార్లిక్స్ కొనడానికి ఆ కొట్టుకు వచ్చిన రాము (శోభన్‌బాబు) "పాపం, ఇవ్వరాదటయ్యా!" అంటూ సిఫార్సు చేశాడు.

"ఇవేం పిప్పరమెంట్లు కావయ్యా -- నిద్రమాత్రలు కాస్త డోసు ఎక్కువైందంటే అంతే— ఇంక నిద్రలేవరు. రోజూ పేపర్లలో చూస్తూనే ఉన్నావుగా ? ... మొగుడు కొడితే ఆత్మహత్య. పరీక్షపోతే ఆత్మహత్య. తొలిరోజు అభిమాన హీరో సినిమా టిక్కెట్లు దొరక్కపోయినా ఆత్మహత్యే !" అంటూ కొట్టతను "సరే ... పెద్దమనిషి నువ్వు చెబుతున్నావు కాబట్టి ఒకటిస్తాను" అన్నాడు.

"ఒక్కటా ! మా అమ్మమ్మకి రోజుకో బిళ్ళ కావాలండి. రోజూ నే షాపుకి రావాలంటే బిళ్ళ ఖరీదు మూడు పైసలయితే, రిక్షాకు మూడు రూపాయలవుతుంది," అంది సుధ.

"సరే–రెండిస్తాను. ప్రిస్క్రిప్షన్ లేకుండా ఎక్కువిచ్చానంటే – మీ అమ్మమ్మ మూలుగుతో పాటు నా ఉద్యోగం కూడా మూలుగుతుంది," అని కొట్టతను మూలుగుతూనే ఇచ్చిన మాత్రలను సుధ పుచ్చుకొని, వెంటనే రిక్షాలో బయలుదేరింది. ఎకాయెకీన మరో రిక్షాలో ఆమెను రాము వెంబడించాడు. హాస్టల్ వద్ద సుధ రిక్షా దిగి, తన గదిలోకి వెళ్లి మంచినీళ్ళు తాగబోతూంటే, రాము చివాలున వచ్చి ఆమె చెయ్యి పట్టుకొని, "ఆగండి ! ఏమిటి మీరు చేసే పని ? ఆ నిద్రమాత్రలు ఇలా ఇచ్చెయ్యండి. ఆవేశంలో మీరేం చేద్దామనుకుంటున్నారో మీకే తెలియడం లేదు. కష్టాలు మనుషులకు కాక మాన్లకు వస్తాయా ? ఒక్క క్షణం ఆలోచిస్తే, మళ్ళీ జీవితంలో మీరిలాంటి పని చేయలేరు. నా మాట వినండి. ఇచ్చేయండి," అన్నాడు.

దాంతో సుధతోపాటు అక్కడ మూగిన ఆమె స్నేహితురాండ్రు గొల్లున నవ్వారు. ఒక యువతి "మీరనుకున్నట్లుగా ఆ నిద్రమాత్రలు మింగేది అందమైన ఈ సుధ కాదు," అంటూ దూరంగా వస్తూన్న వార్డెన్‌ను చూపించింది.

"మా వార్డెనమ్మ. ఆవిడ్ని నిద్రపుచ్చి, నిద్రమాత్రకో సినిమా చొప్పున చూస్తూంటాం. అర్థమైందా ?" అంది సుధ.

"అర్థమైంది. ఈ విషయం ఆవిడకి చెప్తే, బాగా అర్థమౌతుంది," అంటూ రాము బెదిరించాడు.

"చెప్తారా ? ఆడపిల్లల హాస్టల్లో దూరి అల్లరి చేస్తున్నావని మేము చెప్తాం !" అని ఓ అమ్మాయి అంటూండగానే వార్డెన్ వాళ్ళ దగ్గరికి రాసాగింది. "ఇరకాటంలో పడ్డ రాము తప్పించుకోడానికి ఎన్ని అవస్థలు పడవలసి వచ్చిందంటే – ఆ తర్వాత ఒక నిద్రమాత్రను అతనే మింగవలసి వచ్చింది," అంటూ తదుపరి షాట్‌ను వివరించారు డైరెక్టర్ పి. చంద్రశేఖరరెడ్డి. డిసెంబర్ 5న విడుదలయ్యే ఉషశ్రీ మూవీస్ "మానవుడు మహనీయుడు" చిత్రానికి పి. జె. ప్రభాకరరెడ్డి, కైలాష్‌చంద్ర అగర్వాల్ నిర్మాతలు. సి. సత్యనారాయణ, సుధీర్‌కుమార్ అగర్వాల్ సహ నిర్మాతలు. ఉషశ్రీ కథ, స్క్రీన్‌ప్లే రాశారు.



'గోల నాగమ్మ'లో కల్పనారాయ్, సత్యనారాయణ

## విష్ణుప్రియా ప్రొడక్షన్స్

''రెండు చిత్రాలను మొదలెట్టబోతున్నాను,'' అన్నారు ''కోడళ్ళొస్తున్నారు జాగ్రత్త'' లాంటి హిట్ చిత్రాలను నిర్మించిన జాగర్లమూడి రాధాకృష్ణమూర్తి. ఫిబ్రవరినుంచి ఏప్రిల్ వరకు షూటింగ్ జరిగే చిత్రంలో శోభన్‌బాబు, జయసుధ, శారద ముఖ్య భూమికలు నిర్వహిస్తారు. గొల్లపూడి రచన, సత్యం సంగీతంతో కట్టా సుబ్బారావు దర్శకుడు. రెండో చిత్రంలో కృష్ణ హీరో.

## సినిమా

## ఎన్. టి. ఆర్ – దాసరి

''ఫిబ్రవరినుంచి ఏప్రిల్‌వరకు ప్రతినెలా 20 నుంచి 30వ తేదీవరకు షెడ్యూల్స్ ప్లాన్ చేశాం,'' అన్నారు కొసరాజు భానుప్రసాద్. ఈయన దాసరి నారాయణరావు కథ, స్క్రీన్‌ప్లే, మాటలు, దర్శకత్వంలో నిర్మించే కవిరత్నా మూవీస్ తొలి చిత్రంలో ఎన్. టి. ఆర్ సరసన శ్రీదేవి నాయిక.

సత్యసాయిబాబాపై చిత్రం 'సుధా బిందువులు'లో జగన్నాథరాజు, నర్సింగరావు



## చిత్రాల విచిత్రాలు!

★ ''స్వప్న'' చిత్రంలో రాంజీకి డైరెక్టర్ దాసరి, స్వప్నకు సరిత, ''శుభోదయం''లో చారుహాసన్‌కు రచయిత జంధ్యాల, ''టక్కర్'' హిందీ చిత్రంలో జయప్రదకు రాధాసలూజా సంభాషణలు పలికారు.

★ హిందీ సంగీత దర్శకులు కల్యాణ్‌జీ – ఆనంద్‌జీ ''గుస్తాఖ్ – ఇ – జమాన్'' అనే చిత్రాన్ని నిర్మిస్తున్నారు.

★ తెలుగు, తమిళం, కన్నడం, మలయాళం, హిందీ, మలయా, ఫ్రెంచ్ భాషలు తెలిసిన నటి లక్ష్మి.

★ బిందియా గోస్వామి తండ్రి హిందువుడు. తల్లి క్రైస్తవురాలు. భర్త ఇటీవలే ఇస్లాం మతం స్వీకరించిన వినోద్ మెహ్రా.

★ సంగీత దర్శకుడు ఇళయరాజా ఒకప్పుడు జి. కె. వెంకటేశ్‌కు సహాయకుడుగా పనిచేశాడు. ఇటీవల ఒక తమిళ చిత్రంలో తన గురువుగారిచే ఒక పాట పాడించాడు.

★ అమెరికా అధ్యక్షుడు రేగన్ 1937లో ''హార్మనెస్'', 1941 లో ''లవ్ ఈస్ ఆన్ ది ఎయిర్'', ఆ తర్వాత ''కింగ్స్ రో, హార్మ యువర్ వింగ్స్, హెల్ ఈస్ ఏంజెల్స్, డాన్ ప్రెటోల్, బియాండ్ ది లైన్ ఆఫ్ డ్యూటీ, దిస్ ఈస్‌ది ఆర్మీ, నైట్ అన్‌టు నైట్, ది హేస్టీ హార్ట్'' చిత్రాల్లో నటించాడు. 1967 నుంచి 1974 వరకు కాలిఫోర్నియా గవర్నర్ పదవినలంకరించిన ఈయన చిత్ర నిర్మాతలకు తరచు ఒక సలహా ఇస్తుండేవాడు: ''రషస్ వేసి చూసుకునేటప్పుడు మీరు మాత్రమే కాకుండా కొందరు మామూలు ప్రేక్షకులను చూడనివ్వండి. అప్పుడే ప్రేక్షకుల అభిరుచులేమిటో, మీ అంచనాలలో మీరెక్కడున్నారో మీకు బోధపడుతుంది,'' అని ఆయన సలహా.

★ సంజయ్‌ఖాన్ నిర్మించిన ''అబ్దుల్లా'' చిత్రంలోని ఆరు పాటలూ 'సోలో'లే. డ్యుయెట్ సాంగ్ ఒక్కటైనా లేదు. ఆ చిత్ర నాయిక జీనత్ అమన్‌ను జోర్డాన్ రాజుహసన్ తన దేశం తరఫున ఆహ్వానించాడు.

★ ''ఒరు తలై రాగం'' తమిళ చిత్ర ఛాయాగ్రాహకుడు రాజశేఖర్ ''నిఝల్ గళ్'' అనే భారతీరాజా దర్శకత్వం వహించిన చిత్రంలో హీరోగా నటించాడు.

★ లావు తగ్గడానికి తన అనుభవంమీద అరుణా ఇరానీ ఇతర తారలకిచ్చే సలహా ''పెళ్ళయిన నటుడ్ని ప్రేమించండి చాలు. దాంతో ఉత్పన్నమయ్యే సమస్యలు మీరు సన్నబడేలా చేస్తాయి,'' అని.

★ ''కమ్ సెప్టెంబర్'' చిత్రంలో నటించిన జినాలోలో బ్రిజిడా ''వార్మ డిసెంబర్'' అనే చిత్రంలో నటించింది. ఇప్పుడు ''స్ప్లెండిడ్ నవంబర్'' అనే చిత్రంలో బుక్ అయింది.



'ఆశాజ్యోతి'లో సుజాత, మురళీమోహన్

## దాసరి రచన, దుర్గాదర్శకత్వంలో మరో చిత్రం

"కొత్త చిత్రాన్ని ఏప్రిల్‌లో ప్రారంభించి, మే నెలలో పూర్తి చేస్తాం," అన్నారు శ్రీ లలితా ఎంటర్‌ప్రైజెస్ అధినేత జగదీశ్ చంద్రప్రసాద్ చంద్రమోహన్ హీరో సత్యం సంగీత దర్శకుడు దాసరి నారాయణరావు కథ, స్క్రీన్‌ప్లే, మాటలతో దుర్గా నాగేశ్వరరావు దర్శకుడు

## అయింటి ఆడపడుచు

వడాలసూర్య సత్యనారాయణ సమర్పించే ప్రై చిత్రానికి నవంబర్ 20న తొలిగీతం రికార్డింగ్‌తో ప్రారంభోత్సవం జరిగింది శరత్‌బాబు, శారద, గీత, పార్థసారధి, రాజేష్, పసుపులేటి రాము వగైరా తారాగణం మద్దిపట్ల సూరి, జె వి రాఘవులు, వేటూరి, సి శేఖర్, దిలీప్‌సింగ్, రవిరమణ, కె శంకర్, ఎస్ శివశంకర్, బోసు, ఎం ఎస్ ఎన్ రాజు తెరవెనుక కృషి చేస్తున్నారు తెలుగు తమిళ భాషల్లో గొల్లపల్లి వెల్లారావు, వేదవతి సత్యనారాయణ నిర్మించే శ్రీ సాయి చిత్రవారి ఈచిత్రానికి స్క్రీన్‌ప్లే, దర్శకత్వం ఓ యస్ ఆర్ ఆంజనేయులు

## ఏడిద చిత్రానికి భారతీరాజా దర్శకత్వం

"శంకరాభరణం—చిత్రానికి కేరళరాష్ట్రంలో వసూళ్ళు పాతిక లక్షలను దాటాయి," అన్నారు ఆ చిత్ర నిర్మాతలలో ఒకరైన ఏడిద నాగేశ్వరరావు ఈయన ఇటీవల మద్రాసు కామదార్ నగర్‌లో నిర్మించిన భవంతికి 'శంకరాభరణం' అనే నామకరణం చేశారు త్వరలో ఈయన ప్రారంభించే చిత్రానికి భారతీరాజా దర్శకుడు

## టాక్సీ డ్రయివర్

జయ (జయప్రద) ఒంటిమీద కాయాలు పరుగెత్తుకుంటూ రాజా (కృష్ణంరాజు) ఇంట్లోకి వచ్చింది

"ఏమిటి, జయా! ఏమిటీ రక్తం? ఏమైందసలు?" అన్నాడు రాజా

"నిన్ను కలుసుకోకూడదని వార్నింగ్ ఇచ్చి, నన్నోగదిలో బంధించాడు మాడేడీ చివరికెలాగో కిటికీలోంచి దూకి తప్పించుకొచ్చాను"

"ఎక్కడో పాలరాతి మందిరంలో పసిడి బొమ్మలా ఉండాల్సిన నువ్వు నాలాంటి సామాన్యుడి మీద ఆశపడితే — ఫలితం ఇలాగే ఉంటుంది"

"అలా బాధపడకు, రాజా! నిజమైన ప్రేమకు పరీక్షలు తప్పవు"

ఇంతలో అక్కడికి తల్లి పార్వతమ్మ (అత్తిలి లక్ష్మి) వచ్చేసరికి రాజా "అమ్మా, ఈవిడ జయా అని — భాస్కరరావుగారి అమ్మాయి," అంటూ పరిచయం చేశాడు

జయ శుష్కంగా నవ్వి, "నేనెవరి కూతుర్నో నాకే తెలియడంలేదు," అంటూ జాకెట్‌లోంచి ఫోటో తీసి, "ఈ ఫోటో చూడు ఇది మా స్టోర్ రూమ్‌లో దొరికింది ఒకసారి ఈవిడ నా కారుకింద పడబోయింది 'జయా, నువ్వు నాకూతురివమ్మా,' అని నన్నుచూచి ఏడ్చింది," అంది

"అలాగా! ఈఫోటోలోఉన్న అమ్మాయెవరు?" రాజా అడిగాడు

"నేనే! ఫోటో చూసింతర్వాత నేను ఎవరి కూతురినా అని నాకే అనుమానం వస్తోంది ఈవిడేమో — నేనే తన కూతుర్ని అంటోంది మా అమ్మ నా చిన్నతనంలోనే చనిపోయిందని మా డాడీ అంటున్నాడు ఎవరి మాటలు నమ్మాలో నాకు అర్థంకావడంలేదు"

"నువ్వేం బాధపడకు, జయా! ఈ మిస్టరీ ఏమిటో నేను తేలుస్తాను ఇంతకీ, ఈవిడ ఇప్పుడు ఎక్కడుంది?"

"డాక్టర్ లింగరాజుగారి ఆస్పత్రిలో."

షాట్ ఓ — కే అయ్యాక "పిచ్చాసుపత్రికి రాజా పిచ్చివాడుగా వెళ్తాడు," అని తదుపరి సన్నివేశాన్ని డైరెక్టర్ ఎస్ పి చిట్టిబాబు చెప్పారు విశ్వచిత్ర సినీఎంటర్‌ప్రైజెస్ "టాక్సీడ్రయివర్" చిత్రాన్ని యం రవిశేఖర్ నిర్వహణలో జి ఆర్ కె రాజా నిర్మిస్తున్నారు కాశీ విశ్వనాథ్ సంభాషణల కర్త



'కాళరాత్రి'లో ప్రవీణ





## ప్రేమనాటకంలో వింత ఇంటర్వ్యూ

"వెల్‌కమ్, మై డియర్ యంగ్‌మాన్, వెల్‌కమ్! కూర్చో," అన్నాడు లక్ష్మీపతి (నాగభూషణం) కుమార్ (మురళీమోహన్) వినయంగా "ఫరవాలేదు, నిలుచుంటానండి," అన్నాడు

"అతి వినయం నాకు నచ్చదు కూర్చో.. మా బంగళా ఎలావుంది?"

కుమార్ తింక్కాన కూర్చుంటూ, "ఇంద్ర భవనంలా ఉందండీ," అన్నాడు

"నో ఇంద్రభవనంలో ఎయిర్ కండిషన్డ్ రూములున్నట్లు ఎక్కడా — ఏ పురాణాల్లోనూ రాయలేదు కాని, మా బంగళాలో అన్నీ ఎ. సి. రూమ్స్ కాఫీ తాగుతావా? సోని—హాట్‌డ్రింక్స్? బీర్, జిన్, బ్రాందీ, విస్కీ?"

"అబ్బే నాకలాంటి అలవాట్లు లేవండి"

"వెరీగుడ్‌బాయ్ -- అని అంటాననుకున్నావా? నో. నువ్వు అబద్ధమాడుతున్నావని నాకు తెలుసు. ఈరోజుల్లో బీరుకూడ తాగనివాళ్ళు నూటికి అయిదుకంటే ఎక్కువమంది లేరని నాకు తెలుసు. కమింగ్ టు ది పాయింట్ — నీ జీతమెంత?"

"ఆరువందలు"

"గ్రాస్ చెప్పకు నీ చేతికొచ్చేదెంత?"

"అయిదువందల ముప్ఫై"

"అంటే — మా కారుడ్రయివర్‌కన్నా డెబ్బై రూపాయలు తక్కువన్నమాట? నిన్ను ఇన్సల్ట్ చెయ్యడం నా ఉద్దేశ్యంకాదు. మనం మనం కలుసుకునే ముందు ఒకరిగురించి ఒకరు తెలుసుకోవడం చాలా అవసరం. మీనాన్నా, నేనూ ఇరవై సంవత్సరాల్రకితం — ఇద్దరం ఒకేసారి — ఒకే కేపిటల్‌తో బిజినెస్ మొదలుపెట్టాం కాని, ఇప్పుడు — అడవికెళ్తున్న హరిశ్చంద్రుడిలా మీ నాన్న మిగిలిపోయాడు రాజ్యమేలుతున్న రామచంద్రుడిలా నేను పెరిగిపోయాను ఈ తేడా ఎందుకొచ్చిందంటావ్?"

"మా నాన్న దురదృష్టం"

"అదృష్టం దురదృష్టం అనేవి చేతకానివాళ్ళు చెప్పేమాటలు. నేను నమ్మను నువ్వుచెప్పకు — మీ నాన్నకి తెలివితేటలున్నాయి కాని, లౌక్యంలేదు లౌక్యంలేని తెలివితేటలు — రౌతులేని గుర్రంలాంటిది అది పరుగెడుతుంది కాని, గమ్యం చేరుతుందన్న గ్యారంటీ లేదు"

"ఎస్, సార్!"

లక్ష్మీపతి డ్రాయర్‌లోంచి ఓ వస్తువు తీసేసరికి "కట్!" అన్నారు కట్టాసుబ్బారావు

పరిమళ ఆర్ట్ క్రియేషన్స్ "ప్రేమనాటకం" చిత్రాన్ని అమరనాథ్ నిర్మాణ నిర్వహణలో నందకుమార్, బాలనాగయ్య, శంకరయ్య, స్వామి నిర్మిస్తున్నారు కాశీవిశ్వనాథ్ సంభాషణలకర్త

## కె. ఎస్. ఆర్. దాస్ కొత్త చిత్రాలు

"రగిలిన పగ — విడుదలకు సిద్ధంగా ఉంది," అన్నారు దాస్. శ్రీకాంత్ పిక్చర్స్ "రహస్య గూఢచారి", ఎస్. ఎస్ భట్ చిత్రం డిసెంబర్‌కు పూర్తవుతాయి చిరంజీవి, స్వప్నలతో అజంతా కంబైన్స్ తెలుగు, కన్నడ భాషల్లో మొదలెట్టే చిత్రం, ఏప్రిల్ నుంచి కమలహాసన్, శ్రీదేవి జంటతో అష్టలక్ష్మి ఫిలిమ్స్‌వారు తెలుగు తమిళ భాషల్లో ప్రారంభించే చిత్రం, మే నుంచి పి ఎన్ ఆర్ ఆర్ట్స్ (పింజల నాగేశ్వరరావు ఆర్ట్స్) కృష్ణంరాజు హీరోగా నిర్మించే చిత్రాలకు కె ఎస్ ఆర్ దాస్ దర్శకత్వం వహిస్తారు



'బంగారు బావ'లో జయమాలిని

# ఇప్పుడు! హాయిగా సేవించండి సంతృప్తి నిచ్చే చిక్కని, కమ్మని టీ!

# లిప్టన్ టాప్ స్టార్ టీ

చిక్కని కమ్మని టీ కోనం నిజంగా మీరు ఎదురు చూస్తున్నారు. అదే క్రొత్త లిప్టన్ టాప్ స్టార్. అత్యుత్తమమైన మంచి ఎగుమతి రకం డస్ట్ టీ రకాలను మేళవించి చిక్కటి కమ్మని టీ కోనం చూచే మీలాంటి వారి కోనమే యీ టీ
నేడే లిప్టన్ టాప్ స్టార్ కావాలని అడగండి
పూర్తిగా ఫాయిల్‌లోనే ప్యాక్ చేసారు గనుక తాజాగా, చిక్కగా, కమ్మగా మీరు కోరినట్లు వుంటుంది




LT/CAS-I/77R TEL

**సంతృప్తి నిచ్చే స్ట్రాంగ్ టీ**

(గత సంచిక తరువాయి)

























[ఇంకా ఉంది]

ఉప్పలపాటి సూర్యనారాయణబాబు నిర్మాణతలో
ఎ.ఆర్.యస్.శర్మ సమర్పించు

శ్రీ సావరిన్ ఫిలింస్ తప్పక చూడండి!

# సంధ్య





ఈస్ట్‌మన్ కలర్

దర్శకత్వం
ఎ.కోదండరామిరెడ్డి

నిర్మాత
కంచర్ల పూర్ణచంద్రరావు

లక్ష్మీ ఫిలింస్

మాటలు: జంధ్యాల సంగీతం: చక్రవర్తి

LAKSHMI PUBS

పెద్దకథ

# ప్రేమిస్తే ఏమౌతుంది?



విన్నకోట సుశీలాదేవి

రవి రావాలి! ఎండిన ఈ నేలపై తొలకరి జల్లు కురవాలి

రవీ! . రవీ!

నేరస్తులని కూడా వారినేరం విచారించి శిక్ష వేస్తారు! కాని మీరు నానేరం ఏమిటో చెప్పకుండానే ఇంత పెద్దశిక్ష వేస్తున్నారు! మీరెంతనిర్దయులు! .. ఒళ్ళంతా తీవ్రంగా కంపిస్తోంది! . అక్కడ ఎలవలేక లోపలికెళ్ళబోయింది.

ఇంతలో గేటు చప్పుడయింది

స్వాతి వెనుదిరిగి చూసింది! . ఎదురుగా రవి వస్తూ కన్పించాడు

గుండెలు ఝల్లుమన్నాయి! మనస్సు చంద్రుడిని చూసిన సముద్రమైంది! ఒక్కసారి పరిగెత్తుకు వెళ్లి అతని గుండెలమీద వాలిపోవాలనిపించింది! రవీ! ప్రేమ పరీక్షలో నెగ్గావు! నీకు నామీద ప్రేమవుంది! అనుకుంది

"స్వాతీ!"

రవి దగ్గరగా వచ్చాడు మెత్తగా, చల్లగా, హాయిగా వుందా పిలుపు

"అలా నిల్చున్నావే!" అన్నాడు రవి స్వాతి చేతిని మెల్లగా స్పృశిస్తూ స్వాతి నిప్పుసోకిన వెన్న అయింది

"రవీ" అంటూ అతని చేతులు పుచ్చుకుని కళ్ళల్లోకి చూసింది

రవి ఆశ్చర్యపోతూ స్వాతి బుజాలమీద చేతులు వేసి — "ఏమయింది స్వాతీ!" అన్నాడు

"రవీ! ఇక మీరు రారేమో అనుకున్నాను"

"ఛ! అదేంమాట స్వాతీ! రాకుండా వుండగలనా!" అన్నాడు మెల్లిగా

"రవీ! మిమ్మల్ని చూడకుండా ఒక్కక్షణం కూడా వుండలేను! ఈ రెండ్రోజులు ఎంత పిచ్చెక్కిపోయిందో తెలుసా!"

"స్వాతీ!"

"అవును రవీ! నామాటలు విని నవ్వుకుంటున్నారా!"

"నవ్వుకాదు! ఆనందం కలుగుతోంది! నాకింతకన్నా ఏం కావాలి! స్వాతీ! నేను కోరుకున్న స్త్రీ నన్ను ప్రేమించడంకన్నా అదృష్టమేముంది?"

స్వాతిని దగ్గరికి లాక్కుని హృదయానికి హత్తుకున్నాడు ఆమె తలమీద ముఖంఆన్చి "స్వాతీ" అన్నాడు

ఈ రెండు రోజులూ స్వాతి పొందిన ఆవేదన, బాధ ఆ కౌగిలిలో కరిగిపోయాయి.

స్వాతి తలెత్తి, రవి కళ్ళల్లోకి చూస్తూ— "రవీ! మిమ్మల్ని చూడందే వుండలేనండీ" అంది.

(గత సంచిక తరువాయి)

"నేనూ అంతే స్వాతీ! వీలైనంత త్వరలో నీమెడలో మూడుముళ్ళూ వేసి ఎప్పుడూ ఇలా నీకౌగిట్లో వుండిపోతాను సరేనా!" అన్నాడు

పెళ్లనగానే రాధ జ్ఞాపకం వచ్చింది స్వాతికి రవి చేతులమండి తప్పించుకుంది

"అదేమిటి అలా అయిపోయావ్! అసలైంది తీసుకోకుండానే వెళ్లిపోతావా!" అంటు చెయ్యి పుచ్చుకున్నాడు

"ఏమిటది?" అంది స్వాతి

"చెప్పనా!" అంటూ ముందుకువంగి ఆమె పెదవులపై

"ఛీ ఏం పని" అంటూ దూరంగా జరిగి కుర్చీలో కూర్చుంది

"ఏం బాగాలేదా!" కొంటెగా అన్నాడు

"ఈ రెండ్రోజులూ రాలేదే!" అంది

"ఆఫీసు పని స్వాతీ! ఈ రోజు కూడా చాలా పనివుంది కానీ పని వదిలేసి ఆఫీసు నుంచి సరాసరి ఇటే వస్తున్నాను ఈ రెండ్రోజులూ నా కోసం ఎదురుచూస్తూ కూర్చున్నావా స్వాతీ!"

రవి అలా అడగ్గానే ఈ రెండ్రోజులూ తను పడ్డబాధ జ్ఞాపకం వచ్చి సిగ్గు కలిగింది స్వాతికి మాట్లాడకుండా తలొంచుకుంది

**జరిగిన కథ—2 :** రెవిన్యూ డిపార్ట్మెంటులో తాసిల్దారుగా పనిచేసి రిటైరయిన గోవిందరావుకు, ఆయన భార్యకు ఇద్దరు మగపిల్లల తర్వాత పుట్టిన స్వాతి అంటే అమితమైన గారాబం స్వాతి ఓ కాలేజీలో లెక్చరర్గా పనిచేస్తూంటుంది ఉమ కోరికమీద ఆమె బర్త్డే పార్టీకి వెళ్ళిన స్వాతికి అక్కడ రవి పరిచయమౌతాడు. స్వాతి ఇంటికి రవి రాకపోకలు సాగిస్తూంటాడు ఆమెలో అతను చోటు చేసుకొంటుంటాడు రవి మాటల్లో తన మావయ్య కూతురు రాధ విషయం రాగా ఎందుకో అతను తనని మోసం చేస్తున్నాడేమో! అనే అనుమానం చిగురుస్తుంది స్వాతిలో రవి తన మామయ్యకు ఇచ్చిన మాట ప్రకారం అతను రాధనే చేసుకొంటాడని కళ్యాణి ద్వారా తెలుసుకున్న స్వాతి కుమిలిపోతుంది కానీ, తను రాధను ప్రేమించటంలేదనీ స్వాతినే ప్రేమిస్తున్నాననీ, ఆమె ప్రేమ లభించని నాడు తాను బ్రతకననీ అన్న రవి మాటలకు ఆమె మనసు కుదుట పడుతుంది. ఆ తరువాత అతని రాక కోసం ప్రతి రోజూ నిరీక్షిస్తూంటుంది

"నాకు మాత్రం ఆఫీసులో ప్రతి కాగితంలోనూ నువ్వే కన్పించావు! స్వాతీ! ఇలా ఎన్నాళ్ళు? నువ్వా కుర్చీలో, నేనీ కుర్చీలో ఇంతేనా! ఇలా చూసుకుంటూ కూర్చుంటే ముసలాళ్ళమైపోతామేమో!"

రవి మాటలకు ఏం సమాధానం చెప్పలేకపోయింది స్వాతి రాధే కనుక లేకపోయినట్లైతే ఈపాటికి అతనిచేత మూడు ముళ్ళూ వేయించుకుని హాయిగా కాపురం చేస్తూ వుండేది

"కాలమే మన సమస్యని పరిష్కరించాలి రవీ!"

"స్వాతీ! చాలా అన్యాయంగా మాట్లాడుతున్నావ్ ఇంత ప్రేమ చూపిస్తావు! పెళ్లికి ఎందుకు ఒప్పుకోవు! నీ మనస్సేమిటో నాకర్థం కావడం లేదు!"

"రవీ! ఇందులో అర్థం కాకపోవడానికి ఏముంది! మనం పెళ్లి చేసుకుంటే రాధ ఏమవుతుంది?"

"పోనీ రాధకి మంచి సంబంధం చూసి పెళ్లి చేసి ఆ తర్వాతే మనం చేసుకుందాం సరేనా!"

"సరే" అంది స్వాతి

"అయితే ముందు పెళ్లికొడుకుల వేట ప్రారంభించాలన్నమాట!" కుర్చీలోంచి లేస్తూ అన్నాడు రవి

"నేనూ సహాయం చేస్తానండి!"

"థాంక్స్ వస్తాను ఎనిమిదయింది!" అన్నాడు

స్వాతి అతనివేపు కోపంగా చూస్తూ— "ఏడున్నర కొస్తే ఎనిమిదవదూ!" అంది

"ఏం చెయ్యను! రేపు త్వరగా వస్తాలే! ఎక్కువసేపు కూర్చుంటే బాగుండదు! మీ అమ్మగారు ఏమయినా అనుకోరూ! లైసెన్సు వచ్చేస్తే ఎంతసేపయినా కూర్చోవచ్చు!" అంటూ బయటికి నడిచాడు రవి

* * *

ఒకరోజు సాయంత్రం కాలేజీ వదిలాక ఇంటికి బయలుదేరబోతుంటే కళ్యాణి ఆపింది —

"స్వాతీ! కాలేజీ అవగానే అలా పరిగెట్టకపోతే కాస్సేపుండకూడదూ! నేనూ వస్తాను"

స్వాతి మనస్సులో రవి మెదిలాడు! ఈ రోజు రవి వస్తాడు వచ్చి తనకోసం ఎదురు చూస్తూ కూర్చుంటాడేమో? కాని అది కళ్యాణితో ఎలా చెప్పడం?

"ఏమిటే ఆలోచన! పద! పద!" అంటూ బ్యాగ్ సర్దుకుని కళ్యాణి స్వాతితోపాటు బయటికి వచ్చింది

"కళ్యాణీ! మీ అమ్మగారు ఎలా వున్నారు?" స్వాతి అడిగింది

"ఎలా వుంటారు పక్షవాతంలో వున్నవాళ్ళు. అది తగ్గదు హెచ్చదు!"

"ఛ! ఏం మాటలవి కళ్యాణీ!"

"ఆవిడ బాధ చూడలేక అలా అన్నాలే!"

"తమ్ముళ్ళూ, చెల్లెళ్ళూ బావున్నారా?"

"ఏమిటా పరామర్శ? ఎన్నాళ్లకో కనబడ్డదానిలా!" అంది కళ్యాణి

"ఏం లేదు! తెలుసుకుందామని."

"అంతగా తెలుసుకోవాలని వుంటే మా ఇంటికి రా!"

"ఇప్పుడా?"

అని పిలిచింది కళ్యాణి

స్వాతి మనస్సులో తనకోసం ఎదురు చూస్తూ కూర్చునే రవి మెదిలాడు

"ఆలోచన కట్టిపెట్టి ఇంటికి రా!" అని, రోడ్డుమీద పోతున్న రిక్షాని ఆపి ఎక్కింది కళ్యాణి స్వాతి కూడా తప్పనిసరిగా ఎక్కి కళ్యాణి ప్రక్కన కూర్చుంది.

"ఇదివరకు రోజూ సినిమాకో, బజారుకో, షికారుకో వెళ్ళేవాళ్ళం మనిద్దరం కలిసి సినిమాకి వెళ్ళి మూడు నెలలయింది తెలుసా!" అంది కళ్యాణి.

అవును! రవితో పరిచయమై రేపటికి మూడు నెలలు. చక్కగా జ్ఞాపకం చేసింది తన పరిచయానికి గుర్తుగా రవికి ఏదైనా ప్రెజెంట్ చెయ్యాలి! అనుకుంది స్వాతి

"నాతో మాట్లాడదలచుకోలేదా?"

"అబ్బే! అదేం లేదు కానీ, ఇంకెవరైనా వస్తున్నారా?" అనడిగింది స్వాతి

"ఊహు! నువ్వొక్కదానివే!"

"కళ్యాణి! నీ పుట్టినరోజని కాస్త ముందుగా చెప్పకూడదూ! పోనీ పొద్దున్నైనా చెప్పాల్సింది!"

"అసలు నీకు మనుషులు కన్పిస్తున్నారా! నన్ను చూస్తే నేను చెప్పకుండానే తెలిసేది"

అప్పుడు చూసింది పరీక్షగా స్వాతి. కళ్యాణి తలంటు పోసుకుంది. గ్రీన్ బోర్డరున్న కాశ్మీరు సిల్కుచీర కట్టుకుంది

నిజంగా ఇవ్వాళ కొత్తగా వుంది కళ్యాణి.

"ఏవయింది మీ ప్రేమ వ్యవహారం?" అనడిగింది కళ్యాణి

"ఏమీ కాలేదు!" అంది స్వాతి సంభాషణ తుంచేస్తూ

"కానీ స్వాతి! నువ్వు ప్రేమలో పడ్డావంటే చాలా ఆశ్చర్యంగా వుంది ఎంతో సీరియస్‌గా వుంటావ్! నీ దగ్గరికొచ్చే ధైర్యం అసలు ఏ మగాడికైనా వుందా!"

అవును ఎవ్వరికీ ధైర్యం లేదు! ఆడపిల్లని ఎలా ఆకర్షించాలో ఈ లోకంలో ఎంతమందికి తెలుసు?

రిక్షా కళ్యాణి ఇంటిముందు ఆగింది

ఇద్దరూ రిక్షా దిగారు మెట్లెక్కి లోపలి కెళ్ళారు.

"కూర్చో స్వాతి!" అని కళ్యాణి లోపలకు వెళ్ళబోయింది. ఇంతలో బయటినుంచి—"కళ్యాణీ!" అన్న పిలుపు విన్పించింది. కళ్యాణి గుమ్మంలోంచి బయటికి తొంగి చూసి – "ఓ! నువ్వా మోహన్! రా! రా! నీ కోసమే ఎదురుచూస్తున్నా!" అంటూ ఆహ్వానించింది

చూసింది ఎర్రగా, సన్నగా వున్నాడు కళ్యాణి ఇద్దర్నీ పరస్పర పరిచయం చేసింది

"కూర్చో మోహన్!" అని లోపలకు వెళ్ళింది కళ్యాణి

స్వాతి కిటికీలోనుండి బయటికి చూస్తోంది. మోహన్ గోడమీద వున్న క్యాలెండర్లను చూస్తున్నాడు. కళ్యాణి రెండు ప్లేట్లలో టిఫిను తెచ్చింది.

బద్ధ శత్రువుల్లా కూర్చున్న వారిద్దరిని చూసి నవ్వుతూ –

"అదేమిటి? ఇద్దరూ పోట్లాడుకున్నారా!" అంటూ ఇద్దరికీ చెరో ప్లేటు ఇచ్చింది

తనూ ఒక కుర్చీ లాక్కుని కూర్చుని – "ఎలా వున్నాడు? మీ బాస్!" అనడిగింది మోహన్ని.

"అలాగే వున్నాడు!"

"స్వాతీ! వీళ్ళ బాస్‌తో ఎవడో మూడునెలల్లో చస్తావని చెప్పాట్ట! అప్పటినుంచీ ఆయన బెంగ పెట్టుకుని చిక్కి శల్యమౌతున్నాడు. వాడి జోస్యం ఏమోగానీ ముందు ఈ బెంగతోనే చచ్చేట్టున్నాడు!" అంది స్వాతితో.

"తొందరగా చస్తే పీడా వదులుతుంది!" అన్నాడు మోహన్.

"నీకేం! నువ్వంటే మీ బాస్‌కి ఇష్టమేగా!"

ఇంతలో లోపలినుండి కళ్యాణిని పిలవడంతో లేచి వెళ్ళింది కళ్యాణి



# ఉత్తమ-అధమ పరీక్ష

మానవులలో అధముడైనవాడు గర్వించి తానే ఉత్తముడనని అనుకుంటాడు ఉత్తముడు వినయంతో తానే అందరి కంటె అధముడనని భావిస్తాడు ఇది లోక సహజం దీనికి భగవాన్ శ్రీ సత్యసాయిబాబా తమ ప్రసంగంలో చెప్పిన చిన్నకథ ఆధారంగా ఒక ఉదాహరణను చూపుతున్నాను

శ్రీ కృష్ణునికి దుర్యోధనుని స్వభావాన్నీ, ధర్మరాజు స్వభావాన్నీ పరీక్షించాలని బుద్ధి పుట్టింది అతడు దుర్యోధనుడితో – లోకంలో ఏ లోపంలేని ఉత్తముడెవడన్నా ఉంటే తెలప వలసిందని కొన్నాళ్ళు గడువిచ్చాడు అలాగే యుధిష్ఠిరుణ్ణి చూచి "లోకంలో ఏ మంచి తనంలేని అధముణ్ణి తెలుపగోరాడు" అతనికిన్నీ కొంతకాలం గడువు ఇచ్చాడు. అధమం ఒకడైనా అలాంటివాడు ఉంటాడని, అతణ్ణి కనుక్కొని తనకు చెప్పాలని భగవానుడు వారిద్దరినీ గట్టిగా కోరాడు

కొన్నిరోజులు గడిచాయి దుర్యోధనుడు దేశమంతా తిరిగాడు ఉత్తముడని పేరు పడిన ప్రతి వ్యక్తినీ నిశితంగా పరీక్షించాడు ఒక వ్యక్తి కూడా అత్యుత్తముడుగా కానరాలేదు అట్టి ఉత్తములలో ఏవో లోపాలు కానవస్తూనే ఉన్నవి కనీసం ఒక లోపమన్నా కనబడేది

## – ధర్మపథం –

అందువల్ల అతడు కృష్ణుని వద్దకు తిరిగివచ్చి తనకట్టివాడు ఎవ్వడూ కనబడలేదనీ, తాను (దుర్యోధనుడు) తప్ప అట్టి ఉత్తముడు మరి యొకడు ఉన్నట్లు తోచదనీ చెప్పాడు తానే సర్వోత్తముడనే అహంకారం గల అతణ్ణి చూచి భగవానుడు లోలోపలే నవ్వుకున్నాడు.

తర్వాత ధర్మరాజు కూడా తిరిగివచ్చాడు "నేను చాలా చోట్ల తిరిగివచ్చాను అధములని,పెద్దవారని చెప్పుకునే అందరినీ పరిశీలించాను వారిలో ఏవో కొన్ని మంచిగుణాలు కూడా కానవచ్చాయి నీవు కోరినవ్యక్తి నాకెక్కడా కనబడలేదు ఆలోచించి చూస్తే నేనే అట్టి వ్యక్తినని తోచింది ఆ వ్యక్తిని నీ ముందు నిలబెడుతున్నాను" అని సవినయంగా తెలియజేశాడు.

ఆ మాటలకు భగవానునికి ఎంతో ఆనందం కలిగింది అతడు ధర్మరాజును కౌగిలించుకొని, అతని స్వభావాన్ని మిక్కిలి ప్రశంసించాడు

"నా యీ పరీక్షవల్ల అసలు రంగు బయటపడింది" అని శ్రీ కృష్ణుడు మనస్సులో అనుకున్నాడు

—బులుసు వేంకటరమణయ్య

స్వాతి అక్కడ వున్నదన్నమాటేగానీ మనసంతా రవిమీదే వుంది

రవి వచ్చి వుంటాడు! తనకోసం ఎదురు చూస్తూ వుంటాడేమో! తను ఇంకా రాలేదని బాధపడతాడేమో! చూసి, చూసి విసుగుపుట్టి వెళ్ళిపోతాడేమో

ఆక్షణాన ఇంటిముందు వాలాలనిపించింది స్వాతికి

"స్వాతీ! ప్లేటులో చెయ్యిపెట్టుకుని అలా కూర్చున్నావే!" కళ్యాణి అడిగింది

"ఏంలేదే! తినాలనిపించడంలేదే!"

కళ్యాణి నవ్వింది

"స్వాతీ! నీ బాధ నాకుతెలుసు! ముందీ కాఫీ తాగివెళ్ళు!" అంటు కప్పు అందించింది

స్వాతి కాఫీ తాగుతోంది

కళ్యాణి మోహన్ తనకు బర్త్‌డే ప్రెజెంట్‌గా ఇస్తానన్న వుంగరాన్ని గూర్చి ఆలోచిస్తోంది.

స్వాతి కాఫీతాగడం ముగించి, తన బ్యాగ్ తీసుకుని లేచినిలబడి బర్త్‌డే విషెస్ చెప్పింది

"వస్తా కళ్యాణి! వస్తానండీ మోహన్‌గారూ!" అని బయటికొచ్చి రిక్షా ఎక్కింది స్వాతి

* * *

స్వాతి ఇంటికొచ్చేసరికి రవి తండ్రితో మాట్లాడుతున్నాడు

అతడిని చూసి "అమ్మయ్య వెళ్ళిపోలేదు!" అనుకుని గబగబా లోపలికొచ్చింది.

"ఇవ్వాళ ఆలస్యం అయిందేమ్మా!" అడిగాడు తండ్రి

"కళ్యాణి బర్త్‌డే! పార్టీకి పిలిస్తే వెళ్ళాను!" అని రవి వైపు చూస్తూ – "మీరొచ్చి చాలా సేపయిందా!" అనడిగింది

## ప్రేమిస్తే ఏమౌతుంది?

"ఒక అరగంటవుతుంది! అయినా ఇన్నాళ్ళకి మీ నాన్నగారితో మాట్లాడే అవకాశం లభించింది!" అన్నాడు రవి.

"మీకు కాఫీ తెస్తాను!" అని లోపలికెళ్ళి కాఫీతెచ్చి రవికిచ్చింది! రవి దాన్ని అందుకుంటూ గోవిందరావు వేపుచూచి – "మీరూ" అన్నాడు

"నేను తాగాను! మీరు తీసుకోండి"

స్వాతి ప్రక్కకుర్చీలో కూర్చుంది

"రిటైరయిన తర్వాత జీవితం చాలా డల్‌గా వున్నదండీ!" అన్నారాయన

"రోజూ నేనువచ్చి మీకు కంపెనీ ఇస్తాలెండి" అన్నాడు రవి స్వాతివైపే దొంగచూపులు చూస్తూ.

"అలాగే! అంతకంటేనా! ఇవ్వాళ వివేకానంద మందిరంలో లెక్చర్ వుంది వెడతాను" అని లేచాడాయన. స్వాతిలేచి గదిలోకెళ్ళింది

రవి కూడా లేచాడు.

ఆయన గేటు దాటాక గదిలోకొచ్చాడు స్వాతి తలొంచుకుని మేగజైన్ ఏదో చదువుకుంటోంది

"తమరలా పుస్తకంచదువుకోడంలో వుద్దేశం? నన్ను వెళ్ళిపొమ్మనా! కోపమా?" అన్నాడు రవి

"కోపమా! నాకెందుకు? అయినా మీమీద కోపం తెచ్చుకోడానికి నేనెవర్ని" అంది మూతి బిగిస్తూ.

"ఎవరివో చెప్పనా! ఈ హృదయానికి రాణివి! నిడిచేత పూజలందుకునే దేవతవి!" అన్నాడు తనని వేలెట్టి చూపుకుంటూ.

"ఉ! మాటల చమత్కారానికేం! బాగానే వుంది" అంది మూతి విరుస్తూ.

"మాటలేకాదు, చేతల్లోకూడ చమత్కారం వుంది చూపనా!" అన్నాడు స్వాతి చెయ్యిపట్టుకుని ఊపుతూ

స్వాతి రవి చేయి తీసేస్తూ –

"ఇది ఇల్లు! లోపల అమ్మవుంది! తమరు హద్దుల్లో వుండాలి! అలా కూర్చోండి బుద్ధిగా" అంది

"చిత్తం! దేవిగారి ఆజ్ఞ!" అన్నాడు చేతులు కట్టుకుని తలవంచుతూ!

అతని అభినయానికి స్వాతి ఫక్కున నవ్వింది.

"అమ్మయ్య! ఇప్పటికి ముత్యాలు రాలాయి! కోపం పోయినట్లేనా!"

స్వాతి అతని కళ్ళల్లోకి చూస్తూ – "రవీ! కోపం కాదు బాధ మీరు ఒక్కరోజు రాకపోతే ఎంత పిచ్చెక్కిపోతుందో తెలుసా! రవీ! మిమ్మల్ని చూడకుండా ఒక్కక్షణం కూడా వుండలేను! దయ చేసి రోజూ రండి!"

స్వాతి అభ్యర్ధనకు కరిగిపోయాడు స్వాతి చేతిని తన చేతిలోకి తీసుకుని – "ఒక్కొక్కసారి అనిపిస్తూవుంటుంది ఈ వుద్యోగానికి రిజైను చేసి నిన్ను తీసుకుని ఏ కాశ్మీరో, సిమ్లాకో వెళ్ళిపోవాలని" అన్నాడు

"వెళ్ళిపోదాం రవీ! అక్కడో చిన్న కుటీరం వేసుకుందాం! ఇంటి ముందు చక్కటి పూలతోట కూడ వేసుకుందాం, చెట్లకి కాసే కాయలుతింటూ, సరస్సుల్లోని నీళ్ళుతాగుతూ ఎదురెదురుగా కూర్చుని రోజల్లా కబుర్లు చెప్పుకుంటూ వుంటే ఎంత బాగుంటుందో కదా! జీవితంలో అంతకంటె ఏం కావాలి?"

స్వాతి తన్మయత్వంతో అంటోంది

"స్వాతీ!" అంటూ ఆమెవేపు ప్రేమగా చూస్తూ – "జీవితంలోని మాధుర్యం, ప్రేమలోని

మీ చర్మ యవ్వన సౌందర్య రహస్యం, ఇప్పుడు మీ చేతిలోనే వుంది.
హిమానీ గ్లిసరిన్ సబ్బు నిర్మలంగా శుద్ధమైనదిగా వుందంటే
60 సంవత్సరముల అనువాయతీగా వస్తున్న స్థిరమైనస్థాయి.

పరిశుద్ధమైన గ్లిసరిన్ సబ్బు ఇదే మీ చర్మాన్ని యవ్వనంగా
ఉంచుతుంది, చర్మం ఆరకుండాను, ముడతలు పడకుండా సదా ఉంచుతూ
చమ్మను కాపాడుతుంది. ఇంత పరిశుద్ధమైనది మరి ఏ యితర
గ్లిసరిన్ సబ్బు దీనిలా లేదు—మృదువైన హిమానీ



ఎక్కువ మరుగుతో హిమానీ మీ ప్రతీ అంగాలలో నున్న మురికిని నిర్మూలించగలదు.

మీ చర్మాన్ని ఏ విధంగా వుంచాలో అటువంటిదే హిమానీ ఒక స్వచ్ఛమైన పారదర్శకమైన సబ్బు.
ఇప్పుడు మీ పట్టణానికి కూడా వచ్చింది.

గ్యారంటీ

60 సంవత్సరముల నుండి హిమానీ గ్లిసరిన్ సబ్బు ప్రకృతి శుద్ధమైన నూనెలతో తయారు చేయబడుతుంది ధరలు బాగా హెచ్చింప

తియ్యదనం నిన్ను చూశాకే అనుభవంలోకి వచ్చాయి'' అన్నాడు

రవి చేతిని చెంపకు ఆన్చుకుంది అలా ఎంతసేపు కూర్చున్నారో! హఠాత్తుగా రవి లేచి— 'వస్తాను స్వాతీ!'' అన్నాడు తన చేతిని తీసుకుంటూ

స్వాతి రవి చేతిని గట్టిగా పట్టుకుని—''ఊహు! వద్దు!'' అంది

''లేదు! వెడతాను. బాగుండదు మీ నాన్నగారు వచ్చే టయిమయింది!''

రవి కనుమరుగయ్యేవరకూ చూస్తూ నిలబడి ఆ తర్వాత వెనుదిరిగింది స్వాతి!

* * *

''రాధా! అలా కూర్చున్నావేం తల్లీ!''

రాధ కిటికీలోనుండి బయటికి చూస్తూ కుర్చీలో కూర్చుంది శారదమ్మ మాటకు రాధ వులిక్కిపడి తల తిప్పి చూసింది

ఎప్పుడూ హుషారుగా, నవ్వుతూ తిరిగే రాధ ముఖంలో దిగులు, విచారం కనబడింది ఆవిడకి

రాధకు దగ్గరగా వచ్చి —

''రాధా! నువ్వీ మధ్య చాలా దిగులుగా వుంటున్నావు! ఎందుకలా వుంటున్నావు! ఒంట్లో బాగుండటం లేదా?'' అంటూ ప్రశ్నించింది ఆవిడ.

''బాగానే వుందత్తయ్యా!''

''మరెందుకమ్మా! అలా వున్నావ్! చెప్పక పోతే ఎలా తెలుస్తుంది! చెప్పు తల్లీ!'' అత్తయ్య ప్రేమలో కరిగిపోయింది రాధ

''అత్తయ్యా! బావ అస్సలు నాతో మాట్లాడ్డమే లేదు'' అంది దిగులుగా. శారదమ్మ ఆ మాటకి నవ్వేస్తూ —

''ఓస్ అదా నీ బాధ! వాడికి ఏవో ఆఫీసు పన్లు వుండి వుంటాయ్! తీరుబడిలేక మాట్లాడి వుండడు''

''తీరుబడిలేక కాదత్తయ్యా! ఇదివరక్కన్నా ఇప్పుడు ఏమంత పని పెరిగిందని! నీకు తెలీదు. బావలో ఏదో మార్పు వస్తోంది!''

''మార్పా! నీ మొహం అదేం లేదు!'' అంటూ రాధ మాటని కొట్టిపారేసింది ఆవిడ.

''లేదత్తయ్యా! అదుగో బావ వస్తున్నాడు కావలిస్తే బావనే అడుగు'' అని రాధ కుర్చీలోంచి లేచింది.

రవి లోపలికొచ్చాడు.

''రవీ! రాధ నీ మీద ఏదో ఫిర్యాదు చేస్తోందిరా!'' అంది శారదమ్మ నవ్వుతూ.

రవి కుర్చీ లాక్కుని కూర్చున్నాడు

''ఏమిటమ్మా అది!''

''నువ్వు తనతో మాట్లాడ్డం లేదుట! నీలో చాలా మార్పు వచ్చిందిట.''

రవి రాధ వేపు చూస్తూ—''అవునా! రాధా!'' అన్నాడు

రాధ తలొంచుకుంది

''ఒరేయ్! నేనీ ఫిర్యాదులు వినలేనురా! అయినా ఈ ఫిర్యాదుల వెనక వున్న రాధ మనసులోని భావం గ్రహించావా?'' అంది ఆవిడ నవ్వుతూ

## ప్రేమిస్తే ఏమౌతుంది?

''లేదమ్మా.''

''తొందరలో పెళ్లి చెయ్యి అత్తయ్యా! అని అంతేనా రాధా!''

''ఫో! అత్తయ్యా!'' అంటూ రాధ లోపలికి పరిగెట్టింది.

''పిచ్చిపిల్ల! రవీ! రేపొకసారి శాస్త్రులుగారిని 'రమ్మని చెప్పు'' అంది

రవి వెళ్లబోతూ —

''ఎందుకమ్మా?''

''మీ పెళ్లికి ముహూర్తం పెట్టిస్తాను'' అంది ఆవిడ

రవి కంగారు పడిపోయాడు

''అమ్మా! ఇప్పుడు పెళ్లికి తొందరేముంది?''

''ఇంకానయంరా! ఎన్నాళ్లని! ఇప్పటికే ఆలస్యమైంది వీలైనంత త్వరలో ఈ పెళ్లి జరిగి పోవాలి ఏమంటావ్?''

### మీటింగ్

'ఆకాశంలో నక్షత్రాల కాన్ఫరెన్స్
అధ్యక్షత వహించాల్సిన
చంద్రుణ్ని
మేఘాలు కప్పేసిన వైనం'—
తెల్లారి
పేపర్లో చదివిన సూర్యుడు
సన్నగా నవ్వుకున్నాడు.
వీళ్ల తపనంతా
వెలుగులోకి
రావాలనే కదా!!!

— రామమూరి

రవి ఎటూ చెప్పలేకపోతున్నాడు కాని ఇప్పుడు చెప్పకపోతే ఆ తర్వాత చెప్పడానికి అవకాశం కూడా వుండదు.

''అమ్మా! నేను రాధని చేసుకోలేనమ్మా!''

ఆ మాటకి శారదమ్మ ఆశ్చర్యపోయింది.

''అదేమిట్రా!''

''అవునమ్మా! నేను స్వాతిని చేసుకోవాలను కుంటున్నాను'' అన్నాడు.

''స్వాతి ఎవరు?''

''అదేనమ్మా! ఆ రోజు మనింటికి రాలేదూ! ఆ అమ్మాయి''

''రవీ! నీకేమన్నా మతిపోయిందా! చిన్నప్పట్నించీ అనుకున్న రాధని కాదని ఆ పిల్లనెవర్నో చేసుకుంటావా?''

''అమ్మా! నేను రాధని చేసుకోలేనమ్మా! స్వాతిని ప్రేమించాను! ఆ అమ్మాయినే చేసు కుంటాను. నన్నర్థం చేసుకోమ్మా!''

రవి అలా అడగ్గానే శారదమ్మకి ఏం అనాలో తోచలేదు క్షణం ఆగి అంది —

''రవీ! రాధకి నువ్వంటే ప్రాణంరా! పైగా రాధని కోడలుగా చేసుకుంటానని అన్నయ్యకు మాట ఇచ్చాను నువ్వు ప్రమాణం కూడా చేశావు అదీకాక రాధకి ఎలా చెప్పాలి? నువ్వుమాట్లాడ్డం లేదనే బెంగపెట్టుకుంది నువ్వు కాదన్నావని తెలిస్తే అదేమవుతుంది!''

''తెలుసమ్మా! కానీ ఏం చేయను? రాధను చేసుకోలేను!''

''రవీ! నువ్వంటే ప్రాణంవిడిచే రాధని చేసుకుంటే నీజీవితం హాయిగా వుంటుంది! రాధ చాలా మంచిపిల్లరా! నువ్వు రాధని కాదని వేరెవర్నో చేసుకోవడం నాకిష్టంలేదు! నువ్వూ చదువుకున్న వాడివి ఆలోచించు! ఒక ఆడపిల్లని వుసురు పెట్టడం అంత మంచిది కాదురా!''

''అదికాదమ్మా! పోనీ రాధకి మంచిసంబంధం చూసి పెళ్లిచేసి ఆ తర్వాతే మేము చేసుకుంటాం సరేనా!''

''ఏమోరా! నీఇష్టం!'' అంటూ ఆవిడ అన్యమనస్కంగా అక్కడనుంచి లేచి వెళ్లింది.

రవి అలాగే కూర్చున్నాడు! ఎన్ని అడ్డంకులు వచ్చినాసరే స్వాతిని వదులుకోలేడు! ముందు రాధకి పెళ్లి చెయ్యాలి! రేపటినుండి ఆ ప్రయత్నంలో తిరగాలి! అనుకున్నాడు రవి

''హలో మోహన్!''

ఫాన్సీస్టోర్‌లో ఏదో కొంటున్న మోహన్ వెనుదిరిగాడు! కళ్యాణి నవ్వుతూ కన్పించింది! మోహన్ ముఖం విప్పారింది.

''కళ్యాణీ! చాలా రోజులకి కన్పించావ్!'' అన్నాడు సంతోషంగా.

''అయిందా నువ్వు కొనడం!'' అనడిగింది కళ్యాణి.

''ఆ! నువ్వూ!''

''నేనేం కొనక్కర్లేదు! బయట నీ స్కూటర్ చూసి లోపలికొచ్చాను''

మోహన్ ప్యాకెట్ తీసుకుని డబ్బులిచ్చేసి బయటకొచ్చాడు.

కళ్యాణి ఆనచీర ప్యాకెట్ స్కూటర్‌కి తగిలించిన బాస్కెట్‌లో వేసింది.

''మోహన్! ఆకలి దంచేస్తోంది! ముందు ఏదైనా హోటల్‌కి తీసికెళ్లు!''

''అలాగే! ఎక్కు'' అని స్కూటర్ స్టార్ట్ చేశాడు.

కళ్యాణి వెనక ఎక్కింది.

క్షణంలో హోటల్ ముందు ఆపాడు స్కూటర్ని.

ఇద్దరూ ఫామిలీ రూములో కూర్చున్నారు!

''ఆ! ఇప్పుడు చెప్పు! ఇన్నాళ్లూ తమరు ఎక్కడి కెళ్లారు!'' అనడిగింది కళ్యాణి.

''ఫ్రెండ్ మేరేజ్ అయితే వెళ్లాను''

''పోనీ వెళ్లేటప్పుడు కాస్త చెప్పకూడదూ!''

''చెప్పాలనే అనుకున్నాను. కాని అర్జంటుగా వెళ్లాల్సి వచ్చింది కళ్యాణీ!'' అన్నాడు మోహన్

(ఇంకా ఉంది)

"నేను ఓ టీచర్ని,
నా బట్టలు క్రమ శిక్షణనిచ్చేలా కూడా ఉంటే నాకెంతో ఇష్టం."



మీకు నచ్చే దుస్తులు
మీరు మెచ్చే బట్టలు




సూటింగులు షర్టింగులు చీరలు డ్రెస్ మెటీరియల్స్ మరియు డెనిమ్.

**మఫత్‌లాల్ ఇండస్ట్రీస్** న్యూ షొరాక్ మిల్స్ **మఫత్‌లాల్ ఫైన్**

# సముద్రాల నుంచి సౌరశక్తి

సముద్రాల ద్వారా సౌరశక్తిని ఉత్పత్తి చేయటం చౌకగా సాధ్యం కాగలదని, ఈ శతాబ్ది అంతంలోగ 17,200 కోట్ల పీపాల చమురు శక్తికి సమానమైన ఇంధనాన్ని; సౌరశక్తి ద్వారా అమెరికా ఉత్పత్తి చేయగలదని, అనుకుంటున్నారు. అమెరికా ఇంధనశాఖలో సోలార్ పవర్ అప్లికేషన్స్ కార్యాలయం డైరెక్టర్ మారిస్ జె. కెట్జ్ "ఓషన్ థర్మల్ ఎనర్జి ఉత్పత్తికి గల అవకాశాలు'' అనే అంశంపై ఉపన్యసిస్తూ, పై మాటలు చెప్పారు. ఈ పథకం క్రింద అమెరికాలో 1986 లోగా 100 మెగావాట్ల శక్తిగల యంత్రాలనూ, 1990 లోగా 500 మెగావాట్ల శక్తిగల యంత్రాలనూ, 1999 లోగా 10,000 మెగావాట్ల శక్తిగల యంత్రాలను నెలకొల్పటం జరుగుతుందని ఆయన అన్నారు. ఈ శతాబ్దిలోగా అమెరికన్ ఇంధనావసరాలలో 20 శాతం సౌరశక్తి ద్వారా తీర్చుకొనటాన్ని లక్ష్యంగా పెట్టుకొన్నట్లు డాక్టర్ కెట్జ్ చెప్పారు.

హవాయి కోస్తాలో సాగర విద్యుచ్ఛక్తి ఉత్పత్తికి ఒక పెద్ద ప్రయోగాత్మక యంత్రాన్ని ఏర్పాటు చేయటం జరుగుతున్నది.

ఓషన్ థర్మల్ ఎనర్జి ఉత్పత్తి చేయటానికి, ఇండియా వంటి ఉష్ణమండల ప్రాంతాలు బాగా ఉపయోగపడగలవని డా॥ కెట్జ్ అన్నారు. సాగర జలాలలో, ఎక్కడైతే ఈ ప్రక్రియ బాగా పనిచేస్తుందో తెలుసుకోటానికి అమెరికాలో పరిశోధనలు జరుగుతున్నాయని ఆయన చెప్పారు.

"ముందుగ కోస్తా జలాలలో ఈ ప్రయోగాలు జరుగుతాయి. ఇది విజయవంతమైన తరువాత నడిసముద్రాలలో ఈ పథకాలను ఏర్పాటు చేస్తారు'' అని అన్నారాయన.

"సౌరశక్తి సాగరాలలో నిక్షిప్తమై ఉంటుంది. ఎప్పుడైనా సాగర జలాల నుంచి ఈ శక్తిని వెలికితీయ వచ్చు'' అని ఆయన అన్నారు. "అమెరికా చమురు దిగుమతులను తగ్గించాలని నిశ్చయించింది. గత సంవత్సరం వరకు మేము 80 లక్షల పీపాలు దిగుమతి చేసుకొన్నాము. ఈ సంవత్సరం 15 శాతం దిగుమతులను తగ్గించుకొన్నాము'' అని చెప్పారాయన. ఇంధన పరిరక్షణ చర్యల ద్వారా అమెరికా ఈ విధంగా చమురు దిగుమతులను తగ్గించుకొనగలిగిందన్నారు డాక్టర్ కెట్జ్. ★

అంతమటుకు, ఇలా వెంట్రుకనేదే కనిపించనీయని స్వామి వీరే!

ధ్యానం అయిపోయిన తర్వాత స్వామివారు ప్రార్థనాగీతం శ్రావ్యంగా ఆలపిస్తుంటే, భక్తులు వంతపాడారు!

తర్వాత స్వామివారు బోధన మొదలెట్టారు. ఆయన చెప్పిన విషయం క్లుప్తంగా "ఆత్మ వేరు, శరీరం వేరని మనం ధరించే వస్త్రం చిరిగిపోతే శరీరానికెలా బాధ కలగదో, శరీరానికి బాధవస్తే, ఆత్మ క్షోభించరాదని. శరీరానికి మృత్యువు తప్పదు, ఆత్మ చావదని. ఈ విషయం సదా జ్ఞాపకం వుంచుకొంటే, అందువల్ల యేర్పడే నిర్లిప్తతవల్ల లోకంలో జరుగుతున్న అన్యాయాలు, యుద్ధాలు సగమైనా విలిచిపోతాయని, పైగా యీ విధమైన నిర్లిప్తతవల్ల దుఃఖం దరిచేరదని'' ఇలా సాగి పోయిందాయన వుపన్యాసం.

అందులో నేను కొత్తగా విన్న విషయాలు చాలా కొద్ది. అయినా ఆయన చెప్పిన విషయం కన్నా, చెప్పిన తీరు, ఆయనలోని వర్చస్సు నన్నాకర్షించి, ఆయన పట్ల గౌరవాన్ని కలిగించాయి.

ఉపన్యాసం అయిపోయిన తర్వాత ధనం, వెండి, బంగారం లెక్కలేనంతగా కానుకల రూపంలో ఆయనకు ముట్టింది.

"ఈ ధనం నా కత్యల్పమైంది. అయినా మీరు నా కివ్వగలుగుతున్నారు గనుక స్వీకరిస్తున్నాను. దీని అవసరం వున్న వారికి దీని నందజేస్తాను'' అని ఆయన స్వీకరించారు వాటిని.

ఫల, పుష్పాలు రాసులుగా పోగుపడ్డాయి ఆయనెదుట.

ఒక్కొక్కరే ఆయన దగ్గరకెళ్ళి వారి కష్టాలు చెప్పుకొంటున్నారు. ఆయన వారికేదో ఉపదేశిస్తూ విబూధో, ఫలమో ప్రసాదిస్తున్నారు.

ఇక వెళ్దాంకదాని లేచాను. స్వామివారు నాకేసి చూసి నవ్వి, తన వద్దకు రమ్మన్నట్లు సైగ చేశారు. ఆశ్చర్యంగా వెళ్ళాను.

## భేషజం

[22 వ పేజీ తరువాయి]

మరో అప్పుడైతే నా దుస్తులు, నా పట్ల ఈ జనం చూపే వస్సినా చూసి ఆయన, నన్ను కూడా ఆకర్షించాలని ప్రయత్నిస్తున్నాడనుకొనేవాడినే! కానీ నా కెందుచేతో అప్పుడలా తోచలేదు.

ఆయన దగ్గరకెళ్ళి నమస్కరించాను. ఇంతలో జమీందారుగారు, మరో నలుగురు పెద్దమనుషులూ మమ్మల్ని చుట్టు ముట్టారు.

"సుపుత్రా ప్రాప్తిరస్తు'' అంటూ స్వామివారు దీవించారు.

జమీందారుగారు కంగారుగా — "వారికింకా వివాహం కాలేదు స్వామీ! ఈ హడావిడిలో తమకు తెలియబరచడం కుదరలేదు. వీరు ...'' అని యేదో చెప్పబోతుండగానే —

"నీవు నాకు చెప్పాలా నాయనా ... ఇతను నాకు తెల్సు! కళ్యాణం జరుగుతుంది; వచ్చే యేటికి చక్కని పుత్రుడూ జన్మిస్తాడు'' అంటూ నవ్వారు స్వామివారు. విచిత్రం — నకూ, స్వామివారు చాలా కాలం నించీ పరిచయమున్న వ్యక్తిలాగానే తోచింది. తర్వాత వారి వద్ద శలవు తీసుకొని వచ్చేశాను.

* * *

టెలిఫోను మోగుతూంటే, నిద్రలేచి టైము చూసుకొన్నాను. పన్నెండున్నర అయింది. ఆవులిస్తూ ఫోను ఎత్తాను.

'హలో' అంటూ వినిపించింది జమీందారుగారి గొంతు ఖంగారుగా.

"ఏంటి సార్? ఇంత రాత్రి ఏమైంది!'' అడిగాను.

"మీరు వేగిరం రావాలి!''

"ఎక్కడికి ? ఏమైంది !?''

"మీ వైద్య సామాగ్రితో రండి ... మా ఇంటికి ... తక్షణం'' అని ఫోను పెట్టేసారాయన.

* * *

కారు గేట్లోకి తిప్పుతుండగానే, జమీందారుగారు తమ హోదా కూడా మరచిపోయి పరిగెత్తుకొంటూ వచ్చారు.

కారాపి దిగానో లేదో — "ఆయనకు చాలా సీరియస్‌గా వుంది ... నా పరువు మీరే కాపాడాలి'' అంటూ నా చేతులు పట్టుకొన్నారాయన.

"ఎవరికి ? సరిగ్గా చెప్పండి'' అన్నాను ఖంగారుగా.

"ఆయనకే... స్వాములవారికి —'' చెప్పలేక చెప్పారాయన. "— పదకొండు గంటలకు ఆయన శిష్యులొచ్చి లేపితే లేచాను. బాధతో విలవిల లాడిపోతున్నాడు. ఏం చేయాలో అర్థంగాక చూస్తుండిపోయాను. చివరికి ఆయనే చెప్పారు మీకు కబురు చేయమని.''

జమీందారుగారు, నేను స్వామివారుండే గదిలోకి వెళ్ళాం. మెత్తని పరుపుమీద వుండలా మెలుచుకు పోతూ, కడుపులో నొక్కేసుకొంటూ, బాధతో కేకలేస్తున్నాడాయన!

మంచం దగ్గరకెళ్ళి ఆయన భుజాలు పట్టి సరిగ్గా తిప్పి — "క్షణంసేపు ఓర్చుకోండి... పరీక్ష చేస్తాను'' అన్నాను.

"లేదు .. ఓర్చుకోలేకపోతున్నాను... యీ నెప్పి నా ప్రాణాలు తినేస్తూంది ... నన్నెలాగైనా రక్షించండి'' అన్నారాయన పళ్ల బిగువున.

ఆశ్చర్యంగా ఆయన ముఖంలోకి చూసాను. కళ్లు లోపలికి పోయాయి, కళ్లకింద నల్లని వలయాలు, ముఖం వడలిపోయి వుంది. ముఖంమీద, మూతిచుట్టూ; వంటినిండా విబూధి చారికలే! ఆ తేజస్సు ఎక్కడికి పోయిందో! కొద్ది బాధ కూడా ఓర్చుకోలేని చిన్నపిల్లవాడిలా అలసిపోయాడు, మృత్యువుతో జరుగుతున్న పోరాటంలో.

నన్ను చూసి యేమనుకొన్నాడో యేమోగాని కాస్త సర్దుకొని — "గంటసేపు చెబ్తేగాని మిమ్మల్ని పిలవలేదీ వెధవలు. బాధతో చచ్చిపోయాను. ఎంతసేపూ ఆ విబూధి తినిపించడం, తీర్థం తాగించడం, వాట్నే వంటనిండా పులమడమేగాని, మిమ్మల్నో, జమీందారుగార్నో పిలవరే యీ వెధవలు.

తాజా వార్తలకు, వ్యాఖ్యలకు, కొంగ్రొత్త ప్రత్యేక శీర్షికలకు ఆంధ్రపత్రిక దిన పత్రిక
పెట్టింది పేరు...మీరు మీ కాపీ మీ ఊరి ఏజెంటుద్వారాగాని లేదా మానేజరు,
గాంధీనగరం, విజయవాడ-3 లేదా మానేజరు, బషీర్‌బాగ్,
హైద్రాబాద్-29 కి గాని వ్రాసి పోస్టులో తెప్పించుకొనండి.

# పన్నులు
# సరిగా చెల్లించండి
# దేశాన్ని శక్తివంతం చేయండి

- పన్ను చెల్లించవలసినంత ఆదాయమున్నవారు స్వచ్ఛందంగా ఆదాయం పన్ను రిటర్నులు పంపుకోవటం చటరీత్యా తప్పనిసరి.
- అలా పంపకపోతే వడ్డీ, జరిమానా, శిక్షపడవచ్చు.

## సర్వే జరుగుతోంది

- ఆదాయం పన్ను శాఖవారు సర్వే కార్యక్రమాన్ని పెద్దపెట్టున జరుపుతూ ఇంటింటికీ వెడుతున్నారు. పన్ను చెల్లించవలసినంత ఆదాయం ఉన్నా రిటర్నులు స్వచ్ఛందంగా పంపుకోనివారు అనవసరంగా ఇబ్బందిపడతారు.

## శిక్షకు గురి కావద్దు

- ఇతరులు కనిపెట్టకముందే మీరు స్వచ్ఛందంగా రిటర్నులు పంపి, పన్ను చెల్లించి జరిపే దర్యాప్తులలో అసెస్‌మెంట్ కార్యకలాపాలలో ఆదాయం పన్ను శాఖవారితో పూర్తిగా సహకరించండి ఆ తర్వాత కావాలనుకుంటే ఆదాయం పన్ను చట్టం 1961 సెక్షన్ 273ఏ క్రింద రిటర్ను మాఫీ చేయవలసిందనీ / వడ్డీ తగ్గించవలసిందనీ/జరిమానా విధించవద్దనీ ఇన్‌కంటాక్స్ కమిషనర్‌ను మీరు కోరవచ్చు.
- సంపద పన్ను స్వచ్ఛందంగా పంపుకున్న తర్వాత అటువంటి సదుపాయాన్నే పొందండి.

ఇంకా వివరాలకు వీరిని సంప్రదించండి :

మీ ఆదాయంపన్ను కమీషనర్/ఆదాయం పన్ను అధికారి/లేదా ప్రజాసంబంధాల అధికారి.



డైరక్టర్ ఆఫ్ ఇన్‌స్పెక్షన్,
(రిసర్చ్, స్టాటిస్టిక్స్ అండ్ పబ్లికేషన్)
ఇన్‌కంటాక్స్ డిపార్ట్‌మెంట్
న్యూఢిల్లీ.

davp 80/259

# భేషజం

నువ్వు మంచివాడివి... నన్ను బతికించు, యీ బాధ తగ్గించు...అబ్బా. .చచ్చిపోతున్నాను '' పొర్లుతూ తిరిగి గొడవ మొదలెట్టాడు.

చాలా కష్టంమీద ఆయన్ని పరీక్ష చేయడం సాధ్యమైంది. ఇంజక్షన్ యిచ్చాను అయిదు నిమిషాలకి కాస్త గొడవ తగ్గించి కళ్ళు మూసుకొన్నాడు

బైటకొచ్చి జమీందారుగారితో చెప్పాను – ''వెంటనే ఆపరేషను చేయాలి, అపెండిసైటిస్... నా హాస్పిటల్‌కి తీసుకెళ్దాం'' అని.

''ఇక్కడ కుదరదా ?'' అడిగారు జమీందారుగారు.

''చాలా కష్టం! అక్కడైతే సౌకర్యంగా వుంటుంది.''

''అందరికీ తెలుస్తుందేమో–'' అన్నారాయన.

''ఏం తెలిస్తే !'' అడిగాను కనుబొమ్మలు ముడిచి.

''సర్లెండి. అలాగే చేద్దాం'' అన్నాడాయన తడబడుతూ !

* * *

''ఎలావుంది ?'' అడిగారు జమీందారుగారు.

''ఆపరేషను సవ్యంగా జరిగింది, ప్రమాదం తప్పినట్లే'' చెప్పాను.

''పోన్లెండి హమ్మయ్య వెధవ జబ్బు. తన కొచ్చేసరికి ఎంత యాగీ చేసాడు! ఎలా తయారయ్యాడో అంత గంభీరంగా వుండేవాడూను!!''

నేను నవ్వాను!

''తన జబ్బే తట్టుకోలేనివాడు, విబాధితో నయం చేసుకోలేనివాడు, అన్ని వుపన్యాసాలు ఎలా ఇవ్వగలిగాడు ? అంతంత జబ్బులు ఎలా నయం చేసేసాడు !?'' మళ్లీ ఆయనే అడిగారు.

మళ్లీ నవ్వాను !!

''నవ్వుతారేం ? జవాబు చెప్పండి'' అర్థం లేకుండా నన్ను నిలేసారాయన

''ఏం చెప్పమంటారు .. జనానికి ఆయన మీద వున్న గుడ్డి నమ్మకం ఆయనలో ఆయనకు లేదు మరి'' అన్నాను.

మర్నాడు ఈ విషయం వూరంతా తెల్సింది –

కొడుకు ప్రమాదంలో మరణించాడని తెల్సినా నిబ్బరంగా వుండగలిగిన వీర్రాజుగారీ విషయం తెల్సి గుండె ఆగి మరణించాడు!

పరంధామయ్యగారికి పెరాలిసిస్ వచ్చి ఆ రోజే కుడి కాలూ, చెయ్యీ పడిపోయాయి !!

కానీ వారం రోజుల్లో, నా పర్యవేక్షణలో, స్వామివారు బాగా కోలుకొని హృషీకేశ్ వెళ్లిపోయారు

అయితే – తిరుగు ప్రయాణంలో వారి పరివారంలో యిద్దరు తక్కువైనారు, ఒక శిష్యురాలు నా వద్ద నర్సుగాను, శిష్యుడు కంపౌండరుగాను చేరడం వలన !!

నా ప్రాక్టీసు మునుపటికన్నా రెట్టింపయి, పెళ్లి సంబంధాలు చూసుకొనే తీరిక కూడా లేకుండా తయారైంది. ★

# ఛాంపియన్ డిటర్జంట్ కేక్!

**1అప్**

**మరింత తెల్లదనంతో మీకు విజయం!**



అధిక తీవ్రంగా పని చేసే మురుగ, అధికంగా తెలుపుచేసే పదార్థాలతో శక్తి, దాంతోపాటు శుభ్రతతో బాటు తెల్లదనాన్ని యిస్తుంది మీకు వన్-అప్. దాంతో తెల్లవాటికి మరింత తెలుపు, రంగువాటికి మరింత మెరుపూ వస్తుంది.







**మీకు డబ్బులో మరింత ఆదా!**



వన్-అప్, మరే యితర డిటర్జంట్ కేక్ కన్నా ఎక్కువకాలం మన్నుతుంది. ఎందుకంటే, వాడగానే తొందరగా అరిగిపోతుంది గనక. అంటే ఉతికే ప్రతిసారీ మీరు డబ్బును ఆదా చేస్తున్నారన్నమాటే!

**1అప్**

**ఉతకడంలో ఛాంపియన్!**

ASP/WL.1UP 281

విట్‌కో లిమిటెడ్, కాలోల్ 389 330 గుజరాత్.

మెసర్స్ కోరమాండల్ మార్కెటింగ్ ఏజన్సీస్ ప్రై. లి. 15-1-503/ఏ 16-17, అశోక్ మార్కెట్, ఫీల్ ఖానా, హైదరాబాదు-500 012.




"మరో వికెట్ పడింది!"

రేడియోలో కామెంటరీ జోరుగా వస్తున్నది. వికెట్ పడ్డదన్న మాట కామెంటేటరు చెప్పాడో లేదో రేడియో సెట్ పగిలిపోయేలా ఒకేరొద! రొద ఆగిపోయే టప్పటికి వీధి తలుపు దబదబ బాదిన చప్పుడు! వికెట్లమధ్య పరుగెత్తిన స్పీడులో వెళ్లి తలుపు తీశాను. ఎదురుగుండా మా పెదమామయ్య నిల్చుని ఉన్నాడు.

"ఏరా రామ్మూర్తి! ఐదునిముషాలనుంచి కొడుతున్నాను తలుపు! ఏమిటా గొడవ!" అంటూ చేతిసంచితో లోపలికి రానేవచ్చాడు. రేడియో వాల్యూం తగ్గించి, కుశలప్రశ్నలు వేసి, రేడియో దగ్గరకు చేరాను.

ఆట మాంచి జోరుగా సాగుతున్నది.

ఇమ్రాన్‌ఖాన్ అందచందాలూ— అతను తీస్తున్న పరుగు విశేషాలు— ఎక్కడ ఎన్ని వికెట్లు తీసుకున్నదీ— వివరణ చెబుతున్నాడు కామెంటేటర్. ఇంట్లోకి వెళ్లి అమ్మను పలుకరించి వచ్చి నా పక్కన కూర్చున్నాడు మామయ్య! మామూలు రోజుల్లో అయితే ఇంటిల్లిపాదీ మామయ్య చుట్టూ చేరి కబుర్లు ఆలకించుకునేవాళ్లే! కాని ఈ రోజు రేడియోలో కామెంటరీకి చెవులుసంధించి పిల్లా, మేకా కూర్చున్నారు. రేడియో శబ్దతరంగాలు కర్ణపుటాలు చేరీ చేరకముందే ఆనందల హరులు అందరి మనసుల్లో తేలియాడ సాగినై.

"ఏమిట్రా! ఏదైనా నాటకమా?" అంటూ అడిగాడు మామయ్య ఉండలేక.

"కాదు మామయ్యా! క్రికెట్ టెస్ట్ మాచ్! అంటే క్రికెట్ ఆట."

"ఆట ఆడేచోటుకు వెళ్లి చూడాలిగానీ, ఏమిటీ గొడవ రేడియోలో!" అన్నాడు మామయ్య.

"ఈ మాచ్ కాన్పూర్‌లో జరుగుతోంది! అక్కడికి వెళ్లి చూడలేంగా! రేడియోలో అక్కడ జరుగుతున్న ఆటను వివరిస్తున్నాడు" అన్నాను.

ఇంతలో రేడియోలో పెద్ద పెట్టున కల కలం వినిపించింది. మామయ్య మీద నుంచి నా దృష్టి కూడా అటువైపుకు మళ్లింది. మా బుజ్జిగాడి ముఖం కారకపువ్వొత్తిలా వెలుగుతోంది.

"వెంగ్ సర్కార్ సెంచరీ పూర్తి చేశాడు నాన్నా!" అంటున్నాడు.

"వెరీగుడ్" అన్నాను.

వెంగ్ సర్కార్ పుట్టినప్పటినుంచీ ఎన్ని పరుగులు తీసింది— ఏ దేశంమీద ఎన్ని కొట్టిందీ చెబుతున్నాడు కామెంటేటర్.

మెల్లిగా రేడియోలో సద్దు అణిగిపోయింది. "నౌ అయ్ టెల్ యూ ఎబౌట్ ది ఫీల్డ్ ప్లేస్‌మెంట్" అంటున్నాడు కామెంటేటర్.


జుట్టు పల్చగా నిర్జీవంగా ఉందా?
మీ జుట్టును దట్టంగా
మరింత దిట్టంగా చేసుకోండి...
EGG
Halo
SHAMPOO

## వికెట్ పడింది!

మా అమ్మ తెచ్చిచ్చిన మంచి తీర్థం పుచ్చుకుని మంచం మీద కాళ్ళు చాపుకు కూర్చున్నాడు. చూడబోతే అందరూ తనని నిర్లక్ష్యంచేసి రేడియో చుట్టూ తేనెటీగల్లా మూగటం ఆయనకు బొత్తిగా నచ్చినట్లు లేదు. ఎలక్షన్లో ఓడిపోయిన ముఖంలా ఉంది ఆయన ముఖం.

"ఇమ్రాన్ హాస్‌ఫోర్ స్లిప్స్" అంటు న్నాడు కామెంటేటర్.

మా అందరి దృష్టి అతని కామెంటరీ మీదే ఉన్నది. హిందీ కామెంటరీ వచ్చినప్పుడు వాళ్ళు చెప్పింది అర్థమౌదు కదా! అందుకని ఇంగ్లీషు పోర్షన్ రావటంతో కుతూహలం ఎక్కువైంది. మా మామయ్యకు కూడా ఆ కామెంటరీలో ఇంటరెస్టు పెరిగినట్లుంది. మేము నవ్వినప్పుడు ఆయనా నవ్వుతున్నాడు తల పిలక ఆడించుకుంటూ — ఒకటి రెండు సార్లు నా చూపు ఆయన మీద ఆనింది కాని, ఆయన ముఖంలో కనుపించిన ప్రసన్నత నాకు రిలీఫ్ కలిగించింది. మామయ్య పూర్వ కాలపు మెట్రిక్ చదవటం వల్ల ఆయనకు ఇంగ్లీషు భాష కొట్టినపిండే. ఇప్పటికీ నాలాట్టి వాళ్ళు మాట్లాడే ఇంగ్లీషులో తప్పులు పట్టటం ఆయన హాబీ! పైగా, "కుర్ర సన్నాసులు పట్టుమని పది మెతుకులు తినాలేరు, శుద్ధంగా ఓ ఇంగ్లీషు వాక్యమూ పలకలేరు" అని ఎద్దేవా చేస్తుంటాడు.

"ఇమ్రాన్ బౌలింగ్ ఫ్రమ్ గ్రీన్‌పార్క్ ఎండ్! హిహాస్ ఫోర్‌స్లిప్స్"

"అదేమిటిరా రామ్మూర్తి! ఆ ఆడేచోట వర్షం పడుతున్నదా ఏమిటి! వాడెవడో ఇన్ని సార్లు జారు(స్లిప్)తున్నాడు" అన్నాడు మామయ్య. ఆయనకు సమాధానం చెబుదా మని వెనక్కి తిరిగాను. ఆయన మంచం కొంచెం దగ్గరగా లాగుకున్నట్లు కనిపించింది. మామయ్య ప్రశ్నకు జవాబు చెప్పాలో నవ్వాలో తోచలేదు. ఇంతలో రేడియోలో పెద్ద చప్పుడైంది. సముద్ర ఘోష లాంటి ఘోష! కామెంటేటరు చెప్పేదేమిటో విన పడటం లేదు.

"డాడీ! హి ఈజ్ ఔట్" అంటున్నాడు మా బుజ్జిగాడు, వాడి భూతద్దాల కళ్ళజోడు సరిచేసుకుంటూ.

జుట్టుకు
...
ఉపాయము...



శుద్ధమైన షీకాయిలోని సహజ శోధకర గుణములు స్వస్తిక్ షీకాకాయ్ సబ్బులో నింపబడినవి. వాడడానికి అనువైనది. లిక్విడ్ షాంపూ కంటే ఎంతో పొదుపైనది.



దీని పుష్కలమైన, మృదువైన నురగ మీ జుట్టును మెత్తగా, పూర్తిగా శుభ్రపరుస్తుంది. మీ జుట్టును ఆరోగ్యంగా, నిగనిగలాడేలా వుంచుతుంది. తాజా సువాసన నింపి పట్టువంటి మృదుత్వాన్ని ఒసగుతుంది.




## స్వస్తిక్
# షీకాకాయ్ సబ్బు

ఇందులో షీకాయి కలిసి వుంది. భారత స్త్రీల అందమైన జుట్టుకు పారంపర్యమైన రహస్యము.

shilpi dm 26/79 tel

# వికెట్ పడింది!

"అదేమిటరా బుజ్జీ! ఆ ఆడేవాడెవడో దొంగతనం చేశాడేమిటిరా, పట్టుకున్నారంటున్నావ్!" అన్నాడు మామయ్య. మామూలుగా ఆయన వళ్ళో కూర్చొని పౌరాణిక వీరుల గాధలు చెప్పమని ప్రాణం తీసే మా బుజ్జిగాడి ప్రాణం కొన్ని వందల కిలోమీటర్ల దూరాన కాన్పూర్‌లో అవుటయిన ఆటగాడి మీద మనసు లగ్నమై ఉండటం వల్ల వాడికి చిన్నా, పెద్దా విచక్షణ లేక పోయింది.

మామయ్యకు క్రికెట్ ఆట వివరించి చెప్పాలని ఉన్నా ఆట రసవత్తరంగా సాగుతుండటం వల్ల; "ఉండు మామయ్యా! ఇప్పుడే చెబుతా" నని తప్పించుకున్నాను. ఆయన ముఖంలో చిన్నబుచ్చుకున్న లక్షణాలు కొట్టవచ్చినట్లు కనిపిస్తున్నాయ్.

ఔటయిన వాడి ప్లేస్‌లో కొత్త ప్లేయరు వచ్చాడు! ఫస్ట్ బాల్ ఫోర్ కొట్టాడు! అక్కడ కాన్పూర్‌లో చూస్తున్న ప్రేక్షకులు ఒక్కపట్టున హర్షధ్వానాలు చేశారు. ఆ ఉత్సాహం కొద్దీ ఆ ప్లేయరు మళ్ళీ ఇంకొక ఫోర్ కొట్టాడు. అతను ఎక్కడ ఎన్నిరకలుగా ఆడిందీ, అతనింతవరకు కొట్టిన హయ్యెస్ట్ స్కోర్ ఎంతైంది చెబుతున్నాడు హిందీలో. "ఏమిటిరా చెబుతున్నాడు" అని అడిగాను మా తమ్ముడ్ని. వాడికి కొద్దో గొప్పో హిందీ వచ్చునని గర్వం. అంతమటుకు ఉపయోగపడని వాడి మిడిమిడి జ్ఞానం వాడి కప్పుడొక ప్రత్యేకమైన స్థానం కలిగించింది. అయితే వాడికి హిందీ అంకెలు సరిగారావు. ఆ సంగతి తరువాత ఇంగ్లీషు కామెంటరీ రావటంతో యిట్టే తెలిసింది, వాడుచెప్పిన స్కోర్ తప్పులతడికని.

కొత్తగా వచ్చిన బాట్స్‌మన్ చావచితక కొట్టడం మొదలెట్టటంతో, ఎదుటి పార్టీ కాప్టన్ తన ఫీల్డు మళ్ళీ సెట్ చేసుకున్నాడని చెబుతున్నాడు ఎక్స్‌పర్ట్ కామెంటేటరు.

"హిహేస్ అస్కెడ్ హిమ్ టు గో టూ గల్లీ—"

ఎవరో నా వీపు పట్టుకున్నట్లనిపించి వెనక్కి చూశాను. మామయ్య మెల్లిగా నా వీపు తడుతున్నాడు. నేను చిరునవ్వు నవ్వుతూ ఆయన వంక చూశాను.

"అదేమిటిరా వాడిని సందులోకి (గల్లీ) పంపించేశాడేమిటి ఆ కాప్టెన్! తప్పుచేసిన వాళ్ళకి బహిష్కరించే శిక్ష వేస్తారేమిట్రా." అని ఆత్రంగా అడుగుతున్నాడు మామయ్య.

ఆట హడావుడిలో కాఫీ టయిమయిన సంగతే తెలీలేదు. మామూలు రోజుల్లో ఈ పాటికి తలకాయ నొప్పి వచ్చేదే! పాపం, మా అమ్మ మాత్రం ఆవిడ అవసరం కొద్దీ కాఫీ పెట్టి అందరికీ యిచ్చింది. మామయ్య ఆయన అలవాటు కొద్దీ పెద్దగా చప్పుడు చేస్తూ జుర్రుతూ తాగసాగాడు. మా బుజ్జిగాడు ఆయనవంక తిరిగి ఓ నమస్కారబాణం పారేసి "తాతయ్యా! ప్లీజ్!" అన్నాడు. వాడు చెబుతున్నదేదో అర్థంకాక వాడివంక అయోమయంగా చూచాడు మా మామయ్య.

"కామెంటరీ వినపడటం లేదు." అని ఏడుపు ముఖం పెట్టాడు వాడు.

"ఓరి భడవా! నేను నీకూ లోకువైనానురా" అని గ్లాసులో మిగిలిపోయిన కాఫీ గటగటా తాగేసాడాయన.

ప్రఖ్యాతి గాంచిన ఆటగాళ్ళంతా ఔటయిపోయారు! టెయిలెండర్స్ స్టిఫ్ రెసిస్టెన్స్ యిస్తున్నారు. విదేశీజట్టు కెప్టెన్ ఎన్ని రకాల ఫీల్డు మార్చినా వికెట్లు పడటంలేదు. ఆట రోమాంచితంగా సాగుతున్నది.

"హీహిట్ సిక్స్" ఉన్నట్లుండి గావుకేక

## వెనక్కి నడవండి

వేగం చాలించండి
వెనక్కి నడవండి
క్రింద పడకుండా
పళ్ళూడకుండా
కీళ్ళు జారకుండా
వెనక్కి నడవండి.
చెలాయించినంత కాలం
చెలాయించలేరు అధికారం
దోచుకున్నంతకాలం దోచుకోలేరు
పెరుగుట తరుగుట కొరకేనని గ్రహించండి
బాబూ! ఇక వెనక్కి నడవండి!
ధర్మం కళ్ళెంవేసి లాగుతోంది
ప్రజాశక్తి తాండవం చేస్తోంది
ప్రజల గుండెల్లో రక్తం సెగలు
కక్కుతోంది
ఇకనైన వెనక్కి నడవండి!
మానవత్వంతో బ్రతకండి.

— యల. శారదాదేవి









**అధిక దిగుబడి ప్రతి పైరునుండి ప్రతి సారి పొందాలంటే మీ భూమిలో సారం అధికంగా ఉన్నప్పుడు మాత్రమే సాధ్యమవుతుంది.**

మీ భూసారం అధిక స్థాయిలో ఉండేందుకు ఈ క్రింది పద్ధతులు అవలంభించండి.

1. సిఫార్సు ప్రకారం నత్రజని, భాస్వరం, పొటాసియంలను విజయ్ ఎరువుల ద్వారా అందించండి.

మోతాదు (ఎకరాకు కిలోలలో)

| పైరు | దుక్కిలో విజయ్ 14-28-14 |
|---|---|
| వేరుశనగ (నీటిపాగు) | 85 |
| వేరుశనగ (వర్షాధారం) | 50 |
| పప్పుదినుసు పైర్లు (వర్షాధారం) | 50 |

2. అధిక దిగుబడులకు విజయ్ ఎరువులను సరిఅయిన సమయానికి సరిఅయిన పద్ధతిలో వేయండి.

3. పసువుల పెంట, చెత్త చెదారాలను భద్రపరచిపొలంలో కలియ దున్నండి.

ఇంకా వివరాలు కావలిస్తే ఈ క్రింది చిరునామా నుండి పుస్తకాలు తెప్పించుకొని తెలుసుకోండి.




ఏరియా మేనేజర్
మద్రాస్ ఫర్టిలైజర్స్ లిమిటెడ్
44, కాంతినగర్,
హైదరాబాదు-500 028









నాణ్యమైన, నమ్మకమైన విజయ్ ఎరువులను తయారుచేసేవారు
మద్రాస్ ఫర్టిలైజర్స్
లిమిటెడ్
మణలి, మద్రాసు 600 068

# వారఫలం

**12–12–1980 శుక్రవారం మొదలు**
**18–12–1980 గురువారం వరకు**

మేషం:—గృహ విషయాలలో, ఆరోగ్య విషయంలో, మీరు జరిపే వ్యాపార వ్యవహారాలలో, యంత్ర సంబంధమైన వ్యాపారంలో, మీరుఎంతో పట్టుదలతో, జాగరూకతతో ప్రయత్నించినగాని కార్యసాధన గావింపజాలరు. శుభ కార్యప్రస్తావనలు, చాలమందికి క్రీడావనిలో అవకాశాలు లభింపగలవు. స్త్రీలకు : నగలుకొనే ప్రయత్నం, ఉద్యోగాభివృద్ధిగల వారం.

వృషభం:—గత వారం వలెనే ఈ వారం కూడా మీ గౌరవాభివృద్ధికి, రాజకీయంగా అనుకూలతకు, వ్యాపారాభివృద్ధికి, అనుకూలత చేకూరగలదు. చాలమందికి, క్రీడారంగానుభవం గలవారికి అనుకూలప్రదం. ధనాదాయంగలదు. అప్రయత్నంగా ప్రయాణం చెప్పదగినయున్నది. స్త్రీలకు : నాల్గు విధాల అనుకూలం, వృత్తిలో, ఉద్యోగంలో అభివృద్ధి చెప్పదగినవారం.

మిథునం:—ఈ వారం మధ్యకాలంలో, ప్రత్యేకించి మీకు మేలు జరుగనున్నది. ప్రముఖ వార్తలతో, ఉత్తరాలు అందగలవు. ప్రశంసించే వారం. మీకు మేలు చేయుదలచినవారు, బహుళంగా ఉంటారు. గురువారం మిక్కిలి ప్రోత్సాహకరమైన దినంగా భావించి, కృషి చేయండి. స్త్రీలకు : అన్ని విధాలా ప్రోత్సాహకరమైనవారం. విశ్వసనీయులు వెంట నుండి ఆర్థిక సహాయం చేయగలరు. కళారంగంలో ప్రగతి గల్గుతుంది.

కర్కాటకం : మిశ్రమ ఫలదాయకమైన వారం ఇది. పనులు చకచకా జరిగే మార్గంలేదు. ఉద్యోగ వృత్తులలో అభివృద్ధి చెప్పదగిన గ్రహచారం గలదు. వార ప్రథమ భాగంలో, మీకు సహాయం చేయగలవారు, దగ్గరకు రానున్నారు. స్త్రీలకు : సంతానం వలన ఆనందం, ఉద్యోగం బాగుండే మార్గం. కించిత్తు ధనాదాయము గల వారం.

సింహం:—గత కొన్ని వారాలవలె, ఈ వారం కూడ శ్రమకరమైన, కష్టదాయకమైన ఫలితాలే ఉంటాయి. ఆదాయం ఉన్నది. అంతకు అంత ఖర్చు చెప్పదగినయున్నది. వ్యాపార ప్రయత్నాలు మాత్రం నిర్విఘ్నంగా కొనసాగనున్నది. స్త్రీలకు : ముఖ్యవార్తలు ఉత్తరమూలాన అందగలవు. ప్రయత్నించిన కార్యాలలో అనుకూలతగలదు.

కన్య:—ఈ వారంలో రెండు ప్రధాన సమస్యలు తీరనున్నవి. అధికారుల ఆదరణ, మాటకు విలువ, వృత్తిలో అనుకూలత సంభవింపనున్నది. మీ ప్రయత్నాలు ఆనంద దాయకంగా నెరవేరగలవు. స్త్రీలకు : ఆరోగ్య లోపం, కార్యవిఘ్నం చెప్పదగి యున్నది.

తుల:— ఏ విధంగా చూచినా ఇబ్బందులు కలిగేవారమే. ఆశించిన కార్యాలలో జయం పొందే అవకాశంలేదు. వారాంత దినం సాయంకాలం లాభదాయకంగా పరిణమించనున్నది. కొందరు ప్రముఖ వ్యక్తులు, పరిచితులు మీకు సహకరింపనున్నారు. స్త్రీలకు : బంధువుల, పెద్దలు, అధికారుల ఆదరణ లభించే మార్గమున్నది.

వృశ్చికం:—మానసికంగా బాధ పడుచున్నారు గదా! క్రమంగా మీ బాధ నివారణకు మార్గాలేర్పడగలవు. ధనాదాయం చెప్పదగి యున్నది. అప్పు ఇచ్చే అలవాటుంటే, మానుకోవటం ఎంతైనా శ్రేష్టం. పెద్దపెద్ద వ్యవహారాలలో దూరరాదు. ఉన్నంతలో తృప్తి చెందాలి. శ్రమించి కార్యసాధనగావించు కొనగలరు. స్త్రీలకు : ధనలబ్ధి, చాలమందికి ఉద్యోగప్రాప్తి చెప్పదగిన వారం.

ధనుస్సు:—ఈ వారం మధ్యకాలం, ప్రత్యేకించి మీకేదో మేలు సమకూడనున్నది. మిత్రులు, బంధువులు మీకు సహాయం చేయనున్నారు. కంట్రాక్టు పనులందు చొరవగల వారికి వైద్య వృత్తిలోని వారికి, లాయర్లకు అనుకూలమైన వారం. స్త్రీలకు : ఆర్థికంగా బాగుండటే గాక, వ్యవహారరంగంలో కూడా అనుకూలప్రదమే.

మకరం:—ఎన్నో విధాల ప్రయత్నించినా సానుకూలంగాని పని, ఈ వారం ప్రత్యేకించి, ఒకానొక ముఖ్య వ్యక్తివలన సానుకూల పడగలదు. శ్రమకరమైన వారమయినా లబ్ధిగలదు. ఆర్థిక విషయమై, ప్రాకులాట ఫలవంతం. మీకు ప్రోత్సాహకరమైన, వర్తమానాలందగలవు. స్త్రీలకు :కళారంగంలో, వృత్తిలో, ఉద్యోగంలో అభీష్ట సిద్ధి గలవారమే.

కుంభం:—నూతన బాధ్యతలు మీ భుజస్కంధాలపై బడుతాయి. మోయలేనంతటి బరువు మోయవలసి వస్తుంది. పరులకో, బంధువులకో సహాయ్యపడవలసి వస్తుంది. ఆరోగ్యలోపం కనిపిస్తుంది. స్త్రీలకు : ఆరోగ్యలోపం, ఆర్థికంగా ప్రోత్సాహం లేక పోవడం చెప్పదగిన వారం.

మీనం:—ఈ వారం, మిశ్రమ ఫలదాయకమైన గ్రహచారం గలవారం. ఆశించిన మార్గాలలో ఫలితం అందదు. కొందరు మీకు తెరచాటున అపకారం తలపెట్టినవారుండగలరు. ఆర్థికంగా భాగుండదు. వ్యాపార వృత్తులందు సామాన్య ఫలితం మాత్రమే ఆశింపవచ్చు. స్త్రీలకు : కుటుంబ భారం, పుట్టింటి వారినుండి శుభవార్త శ్రవణం, ఉద్యోగంలో అనుకూలత గల వారం.

— విద్వాన్ కోట సత్యరంగయ్య శాస్త్రి

పెట్టాడు కామెంటేటరు. మా బుజ్జిగాడు లేచి ట్విస్ట్ డాన్స్ చేయటం మొదలెట్టాడు.

"అదేమిటిరా రామ్మూర్తీ! ఈ ఆటలో పోట్లాట కూడా ఉంటుందేమిటిరా? వాడె వడో పహిల్వానులాఉన్నాడే, ఆరుగుర్నొక్కసారి కొట్టాడంటాడు! వాడి జట్టు వాళ్లెవరూ లేరేమిటిరా?" అవతల కామెంటేటరు చెబుతున్నది విననివ్వకపోవటంతో మామయ్య మీద ఒక పక్క కోపమూ, ఉత్సుకతతో ఆయన అమాయకంగా వేస్తున్న ప్రశ్నలకు ఒకపక్కన నవ్వు ముంచుకు వచ్చాయి నాకు!

"వాడు మనుష్ల్ని కొట్టలేదు మామయ్యా! బంతిని కొట్టాడు" అన్నాను.

## వికెట్ పడింది!

నే నిచ్చిన ఎక్స్ప్లనేషన్ ఆయనకు అర్థంకాలేదని నాకు తెలుసు. అయినా అర్థమయినట్లు ఆయన పెట్టిన ఫోజు మటుకు నన్ను ముగ్ధుడిని చేసింది.

పిక్సర్ కొట్టిన ఆటగాడు తరువాత ఔటయిపోయాడు. ఆఖరి ఆటగాడు బాట్ పట్టుకుని వచ్చాడు! అతను ప్రఖ్యాతిగాంచిన బవులర్‌గాని అతను కూడా నిలదొక్కుకుని ఆడుతున్నాడు.

"ఎటాకింగ్ ఫీల్డ్ పెట్టాడు" కామెంటేటరు చెబుతున్నాడు!

"హీ ఈజ్ నవ్ రన్నింగ్ టు బౌల్—ఇట్ ఈజ్ ఎ లెగ్ బ్రేక్."

"అదేమిటిరా కాలికి బ్రేక్ వేశాడా?" మామయ్య దిగ్భ్రాంతితో అన్నాడు. మామయ్య ప్రశ్నకు సమాధానం చెప్పేటంతో—

"హి గాట్ హిజ్ లెగ్ బిఫోర్. ది లాస్ట్ వికెట్ హాజ్ ఫాలెన్" కామెంటేటరురేడియో సెట్టు పగిలిపోతుందేమో అన్నట్లుగా రొద—రేడియో సెట్టులోనుంచి ఇంటినిండా వ్యాపించింది. మా బుజ్జిగాడి హుషారు గురించి చెప్పేదేముంది. మామయ్య మటుకు వింతగా మా ముఖాలవంక చూస్తూ ఉండిపోయాడు, కొంత అర్థమయ్యీ కొంత అర్థంకాక.

ఆంధ్ర సచిత్ర వారపత్రిక పరిశీలనార్థం పంపే బొమ్మలు, ముఖచిత్ర రచనలు పంపేవారు కూడా వాటితోపాటు తగినన్ని తపాలా బిళ్లలు అంటించిన కవరును జతపరచకపోతే అవి త్రిప్పి పంపబడవు. —సం.

## బాల కార్మికులు !

మన భారతదేశంలో తీసిన లెక్కలలో యావత్ భారతదేశంలోనూ ఈనాడూ స్కూళ్ళకు పోయి చదువుకోవాల్సిన వయస్సులో ఉండే చిన్న పిల్లలు, ఆ పనిచేయాలేక, వారి కన్నవారికంత శక్తి లేక అట్టివంటివారు నాలుగు కోట్ల మంది కూలి పని చేస్తున్నారట.

## రైళ్లలో హెచ్చరికలు !

బొంబాయి ఎలెక్ట్రిక్ ట్రైనులలోనూ, సబర్బన్ రైళ్లలోనూ అమ్మలూ, అమ్మాయిలూ, మీకు నగలున్నాయని అందరకూ తెలిసేట్టు ఆ నగలను ధరించడం దొంగలను రెచ్చగొట్టడం వంటిదే అనే పోస్టర్లు అంటిస్తున్నారట ఇటీవల రైల్వేవారు.

### ఢిల్లీ మహిళల చైతన్యం !

కట్నాల బాధలనూ, అత్తమామల, భర్త అల్లర్లు పడలేక నీలం అనే మార్వారీ అమ్మాయి సెప్టెంబరు 7వ తేదీన ఢిల్లీలో తనుంటున్న భవంతి మేడ మీది నుంచి దూకి ఆత్మహత్య చేసుకోవడంతోనే ఢిల్లీలో మహిళలలో చైతన్యం బయలుదేరిందట. సెప్టెంబరు 21వ తేదీన సుమారు ఆరువేలమంది మహిళలు సత్యనారాయణ పార్క్‌లో పోగై కట్నాలను నిరసించారట. ఆ దారుణం చేసిన జైన్ కుటుంబంతో స్నేహసంబంధాలేమీ పెట్టుకోకూడదని ఆమాట కొస్తే జైన్‌లతోనే మిగతావారు స్నేహసంబంధాలు పెట్టుకోకూడదనీ తీర్మానించారట. అంతే గాక వీరంతా ప్రతి పెళ్ళికీ వెళ్లి కట్నం చేతులు మారుతోందా అని విచారించి, అలా జరిగితే దాన్ని ప్రతిఘటించి తీరాలని కూడా ఓ నిశ్చయానికి వచ్చారట!

### పాత హాలీవుడ్ చిత్రాలకి గిరాకీ !

అమెరికా ప్రెసిడెంట్ రోనాల్డ్ రీగన్ గొప్ప హాలీవుడ్ నటుడు. డిష్యుం, డిష్యుం సినిమాలలో ఆయన చాలా వేషాలు వేశారట. గుర్రాల మీద పరుగులు, దారి దోపిడీలు ఉన్న సినిమాలలో ఆయన ఎక్కువ నటించారట. ఇప్పుడా సినిమాలన్నీ దుమ్ము దులిపి బయటికి తీసి, అమెరికా ప్రెసిడెంట్ నటించిన చిత్రం నేడే చూడండి అని టాంటాం వేస్తున్నారట. మన ఎం. జి. ఆర్. లా అన్నమాట — ఆహా !

## వ్యోమగాములకు అత్యున్నతమైన అవార్డులు

సాల్యూత్-6-సోయూజ్ అంతరిక్ష సముదాయంలో 185 రోజుల పాటు అంతరిక్షంలో గడిపి, అపూర్వ ధైర్యసాహసాలను ప్రదర్శించి, అత్యంత నైపుణ్యంతో, అపార విజ్ఞానంతో అత్యంత క్లిష్టమైన పరికరాలు ఉపయోగించి శాస్త్రీయ — సాంకేతిక పరిశోధనా కార్యక్రమాన్ని జయప్రదంగా పూర్తిచేసిన సోవియట్ వ్యోమగాములు లియోనిడ్ పొపోవ్, వాలెరి ర్యూమిన్‌లకు నిన్న క్రెమ్లిన్‌లో జరిగిన సభలో లియోనిడ్ బ్రెజ్నేవ్ "అత్యున్నత సోవియట్ అవార్డుల"ను బహూకరించారు.

"శాల్యూత్-6-సోయూజ్ కక్ష్యా సముదాయంలో దీర్ఘకాలిక యాత్రా కార్యక్రమాన్ని జయప్రదంగా అమలు జరిపినందుకూ, ధైర్య సాహసాలను ప్రదర్శించినందుకూ లియోనిడ్ ఇవానోవిచ్ పొపోవ్‌కు "ఆర్డర్ ఆఫ్ లెనిన్" "స్వర్ణతార పతకం"తో పాటు "సోవియట్ వీర" బిరుదం, వాలెరీ విక్టోరోవిచ్ ర్యూమిన్‌కు "ఆర్డర్ ఆఫ్ లెనిన్" అవార్డు, "ద్వితీయ స్వర్ణతార పతకం" ప్రదానం చేయబడుతూ వున్నాయి."

బాహ్యాంతరిక్షంలో అద్భుత సంఘటనకు స్మృతి చిహ్నంగా యీ యిద్దరు వ్యోమగాములకు ఒక సర్టిఫికేట్, కక్ష్యా పరిశోధనా సముదాయం నమూనాలు సైతం బహూకరింప బడ్డాయి. నాలుగు సంవత్సరాలుగా భూకక్ష్యలో పనిచేస్తున్న కక్ష్యా కేంద్రం సాల్యూత్-6 చిత్రం యీ నమూనాపై వుంది. ఈ కక్ష్యా కేంద్రానికి 28 మంది వ్యోమగాములు 14 యాత్రలు జరిపి 96, 140, 175, 185 రోజులు గడిపి వ్యోమ యాత్రలో నూతన రికార్డులు స్థాపించారు. ఈ యాత్రలలో జెకోస్లొవాకియా, పోలెండ్, జర్మన్ ప్రజాతంత్ర రిపబ్లిక్, బల్గేరియా, హంగరీ, వియత్నాం, క్యూబా వ్యోమగాములు పాల్గొన్న ఏడు అంతర్జాతీయ యాత్రలు సైతం వున్నాయి. ఈ కక్ష్యా కేంద్రంతో 25 వ్యోమ నౌకల అనుసంధానం జరిగింది.




### మాయా వినోదం ఆవిష్కరణ :

ప్రముఖ ఐంద్రజాలికుడు ప్రొఫెసర్ బి. వి. పట్టాభిరాం రచించిన ఇంద్రజాల వ్యాసాల సంపుటి మాయా వినోదంను నవంబర్ 4న కళాభవన్‌లో శ్రీమతి జమునా రమణారావుఆవిష్కరించారు. అధ్యక్షత వహించిన డాక్టర్ సి. నారాయణరెడ్డి ప్రతి మనిషి జీవితంలో ఏదో మాయ చేస్తుంటాడని తాను కవిత్వంతో మాజిక్ చేస్తున్నానని అంటూ, మాయా వినోదం తెలుగులో మొదటిసారిగా వెలువడినందుకు ఆనందం వ్యక్తపరచారు. శ్రీ కప్పగంతుల లక్ష్మణశాస్త్రి ప్రసంగిస్తూ, ఇంద్రజాలం ప్రాచీనకళ అని అన్నారు. శ్రీ పట్టాభిరాంను ఇంద్రజాలిక శిరోమణి బిరుదంతో సత్కరించారు. శ్రీ యండమూరి వీరేంద్రనాద్, మెజీషియన్ భావరాజు కామేష్, హిప్నాటిస్ట్ శ్రీ కె. నాగరాజు ప్రసంగించారు. శ్రీ సి. వి. ఎల్. నరసింహ రావు బృందం మైమ్ [మూకాభినయ] ప్రదర్శనం జరిపింది. తొలుత శ్రీ శంకు స్వాగతం చెప్పారు.

### వృత్తి కళాకారులకు

### ప్రత్యేకంగా కార్పొరేషన్ :

రాష్ట్ర లఘుపరిశ్రమల శాఖామంత్రి శ్రీ నాదెండ్ల భాస్కరరావు రాష్ట్రావతరణ దినోత్సవాల సందర్భంగా నవంబర్ 13న జూబిలీ హాలులో ఏర్పాటయిన వృత్తి పనివారల దినోత్సవంలో ప్రసంగిస్తూ, చేతివృత్తుల ప్రోత్సాహానికి, వృత్తి కళాకారులకు సహాయ పడడానికి ప్రత్యేకంగా కార్పొరేషన్ నియమించాలనే ప్రతిపాదనను ప్రభుత్వం పరిశీలిస్తున్నదని అన్నారు. మరి కొంత మందికి జీవనోపాధి. అంతకు ముందు ఆయన వివిధ హస్తకళా వస్తువుల ప్రదర్శనానికి ప్రారంభోత్సవం చేశారు. వివిధ హస్తకళా నిపుణులకు ఆయన బహుమతులు అందజేశారు.

### డాక్టర్ గోపీకి కృష్ణశాస్త్రి అవార్డు :

ఆంధ్రమహిళాసభ శ్రీ దేవులపల్లి కృష్ణశాస్త్రి 83వ జయంతి సందర్భంగా ఉత్తమ కవితకు 500 రూపాయలు బహుమతి (అవార్డు) ఏర్పాటు చేశారు. ఇది ఏటేటా కృష్ణశాస్త్రి జయంతి సందర్భంగా 'కృష్ణశాస్త్రి అవార్డు' అనే పేర ఇవ్వబడుతుంది. తొలి అవార్డు డాక్టర్ ఎన్. గోపీ రచించిన 'తంగేడుపూలు' కవితా సంకలనానికి లభించింది. 1976 నుండి 1979 వరకు వెలువడిన రచనలను ఈఅవార్డుకోసం పరిశీలించారు.'తంగేడుపూలు' ఉత్తమ కవితా సంకలనంగా ఎన్నికయింది. నవంబర్ 1వ తేదీన ఆంధ్ర మహిళా సభ ఆవరణలోని గాంధిశతాబ్ది భవనంలో జరిగిన కృష్ణశాస్త్రి జయంతి సభలో అవార్డు ప్రదానం జరిగింది. డాక్టర్ సి. నారాయణరెడ్డి అధ్యక్షత వహించారు. డాక్టర్ రావూరి సత్యనారాయణరావు, డాక్టర్ నిర్మల్ శ్రీకృష్ణశాస్త్రి జీవిత విశేషాలను గురించి, కవితా మాధుర్యాన్ని గురించి ప్రసంగించారు. పిదప శ్రీమతి ఛాయాదేవి లలిత సంగీత కార్యక్రమం జరిగింది.

### అఖిలభారత సాహిత్య సమ్మేళనం :

### ఆంధ్రప్రదేశ్ కమిటీ :

అఖిల భారత భాషా సాహిత్య సమ్మేళనం అధ్యక్షుడు శ్రీ కె. జి. జోడ్ ఇటీవల హైదరాబాద్‌కు వచ్చినప్పుడు ఆంధ్రప్రదేశ్ ఆడ్‌హాక్ కమిటీని నియమించారు. దాని నిర్వాహకులువీరు. అధ్యక్షుడు పోతుకూచి సాంబశివరావు. ఉపాధ్యక్షులు : బి. ఎస్. చతుర్వేది, కె. వి. భాస్కరరావు. కార్యదర్శి : నెమలికంటి రామచంద్రరావు. సహాయ కార్యదర్శి : ఎం. ఎల్. శేషబాయి.కోశాధికారి :మండవ శ్రీనివాసరావు సభ్యులు:నిహాల్‌సింగ్, రమేష్ చంద్రలాహొటి, జైనుల్లబ్దీన్, బి. బి. జోషి, డాక్టర్ ఇరివెంటి కృష్ణమూర్తి, వి. ఎల్. సుందరరావు, షావుద్దీన్ నయ్యర్, డాక్టర్ భీమ్‌సేన్ నిర్మల్, వాసిరెడ్డి సీతాదేవి, డి. కమలాశంకర్‌రావు, లక్ష్మీసాగర్. ఈ సందర్భంగా శ్రీ కె. జి. జోడ్ ప్రసంగిస్తూ, రచయితలు తమ వ్యక్తిత్వం, స్వాతంత్ర్యం నిలుపుకొని పురోగమించాలన్నారు. అఖిల భారత భాషా సాహిత్య సమ్మేళనం ఇంతవరకు ఐదు మహాసభలుజరిపిందని, ప్రముఖులు శ్రీ కె. సి. రెడ్డి, శ్రీ పి. వి. నరసింహారావు మున్నగువారు ఈ మహాసభలకు సహాయం చేశారని ఆయన తెలిపారు. రచయితలు రాజకీయాలతో ప్రమేయం లేకుండా తమ కార్యక్రమాలు తీర్చిదిద్దుకోవాలని ఆయన కోరారు. సాహిత్య అకాడెమీ కార్యదర్శి డాక్టర్ ఇరివెంటి కృష్ణమూర్తి ప్రసంగిస్తూ, అందరూ అర్థం చేసుకొనే భాషలో భారతీయులు వ్యవహరించాలని, తెలుగు వారిపై ఆంగ్ల ప్రభావం క్రమంగా తగ్గి భారతీయ భాషలపై అభిమానం పెరగాలని అన్నారు. సభకు అధ్యక్షత వహించిన శ్రీ పోతుకూచి సాంబశివరావు ప్రసంగిస్తూ, బెంగుళూరులో జరిగిన ఐదవ అఖిల భారత సాహిత్య సమ్మేళనం జయప్రదమైందని, వివిధ భాషా రచయితలకు ఈ మహాసభ ఒక వేదిక అని అన్నారు. శ్రీ నెమలికంటి రామచంద్రరావు వందన సమర్పణ చేశారు.

### డాక్టర్ రామరాజుకు

### నేషనల్ ప్రొఫెసర్ పదవి :

ఉస్మానియా విశ్వవిద్యాలయం తెలుగు శాఖాధ్యక్షులు డాక్టర్ బిరుదురాజు రామరాజుకు యూనివర్సిటీ గ్రాంట్సు కమిషన్ నేషనల్ ప్రొఫెసర్‌షిప్ లభించింది. ఇదివరకు భాషా శాస్త్రంలో డాక్టర్ భద్రిరాజు కృష్ణమూర్తికి, ఇంగ్లీషు ప్రొఫెసర్ డాక్టర్ కుమార్‌కు ఈ పదవి లభించింది.తెలుగుశాఖ వారికి లభించడం ఇదే తొలిసారి. ఈ పదవి సంవత్సరంపాటు ఉంటుంది. ఈ పదవి పొందినవారు దేశంలోని వివిధ విశ్వవిద్యాలయాలలో సాహిత్య సంస్కృతులపై ప్రసంగించవలసి వుంటుంది. డాక్టర్ రామరాజు జానపద సాహిత్యంలో రామాయణం మున్నగు విషయాలపై ఆంగ్ల, ఆంధ్ర, హిందీ భాషలలో ప్రసంగించడానికి కార్యక్రమం సిద్ధపరచి వివిధ విశ్వవిద్యాలయాలకు అందజేశారు.

# హైదరాబాద్ నోట్ బుక్

### గోల్కొండ విద్యార్థికి మరల నెహ్రూ అవార్డు :

సోవియట్ భూమి నెహ్రూ అవార్డును వరుసగా ఎనిమిది సంవత్సరాలుగా సంపాదించే ఘనత గోల్కొండ కేంద్రీయ విద్యాలయానికే దక్కింది. ఈసారి సోవియట్ భూమి నెహ్రూ అవార్డు గోల్కొండ కేంద్రీయ విద్యాలయం ఎనిమిదవ తరగతి విద్యార్థి ఎస్. రామమోహన్‌రావు గెల్చుకున్నారు. ఇతనికి బంగారు పతకం, విశేషయోగ్యతా పత్రం బహూకరిస్తారు. ఈ బహుమతిలో భాగంగా ఇతర దేశాల బహుమాన గ్రహీతలతోపాటు సోవియట్ యూనియన్‌లో నల్లసముద్ర తీరంలో ఉన్న "ఆర్టెక్ యంగ్ పయనీర్స్" శిబిరంలో నెలరోజులపాటు గడిపే అవకాశం కూడా ఎస్. రామమోహన్‌రావుకు లభిస్తుంది. ఇతడు రచించిన



నేను మెచ్చిన ఆట అనే నీటిరంగుల చిత్రానికి ఈ అవార్డు లభించింది. విద్యాలయం విద్యార్థులను వరుసగా నెహ్రూ అవార్డు విజేతలయ్యేట్లుగా తీర్చిదిద్దిన కళాధ్యాపకుడు శ్రీ బి ఎ. రెడ్డి ప్రశంసాపాత్రుడని విద్యాలయం ప్రిన్సిపాల్ శ్రీ ఎస్. రామేశ్వరం అన్నారు.

### ఉపశ్రుతి :

ఏమిటిసార్ ! ఒక వైపు విద్యార్థులు రాజకీయాల్లో ప్రవేశించరాదు, తమ చదువు చట్టుబండల్లోనే శ్రద్ధ వహించాలి అంటూ, మరొకవైపు వారికి యువజన కాంగ్రెసు (ఐ) సన్మానమేమిటి? ఇది వారిని రాజకీయాలలో ప్రవేశించండి అని చెప్పడంకాదా ? అనడిగారు ఒకరు నన్ను. నేను జవాబు చెప్పేలోగా, పక్కనే ఉన్న ఒక యువజన కాంగ్రెస్ (ఐ) నాయకుడు, "అదెలా అవుతుంది సార్ ! కాంగ్రెస్సయ్యే దేశం, దేశమే కాంగ్రెస్సయ్. అది రాజకీయ పార్టీ ఎలా అవుతుంది ?" అని గద్దించాడు.

—తిరుమల రామచంద్ర

# స్వర్గానికి రాజబాట

అడవిలో క్రొత్తవారు బాట తప్పడం పరిపాటి. అదీ అర్ధరాత్రిలోనైతే సరేసరి. ఎంచేతనంటే, అడవిలోంచి [illegible] [illegible]గులలో ఎన్నో దారులు కనిపిస్తాయి. అమావాస్య కటిక చీకటి, అలముకొంటే, కన్ను పొడుచుకొన్నా కానరాదు [illegible] ఇలాగని చెప్పి మనం ఏ దారిని బడితే ఆ దారిన పోతే గమ్యం చేరలేము సరిగదా గచ్చపొదలో చిక్కుకుపోతాం. పోనీ, [illegible] సాయంతో ఊహించి ఉరకలేస్తే ఊరు చేరలేం సరికదా ఊహాపథంలోనే ఊయల ఊగుతుంటాం, వెనుక్కి ముందుకు [illegible] అనక గమ్యం అగమ్యగోచరం.

అలాఅయితే, వెళ్ళేవాళ్ళంతా దారి తప్పుతున్నారాఅంటే, లేదు. సరైనదారి తెలిసినవాళ్ళూ కొందరుంటారు. వాళ్ళు [illegible] గమ్యం చేరుకొంటారు.

ఇంతకూ చెప్పొచ్చిందేమిటంటే, మతాలన్నీ ఒకటే, అవన్నీ అన్ని మార్గాలు మోక్షానికి. అల్లాంటప్పుడు ఏ మార్గం [illegible] స్వర్గం చేరేందుకు అనేది మన దేశ వ్యాప్తంగా ప్రబలిపోయిన సనాతన సహజ వేదాంతం.

కారి పోవవు వారు చీకటి అలుముకుపోయిన అడవిలాంటి ఈ ప్రపంచంలో పయనిస్తున్న మనం, మన స్వగృహానికి, [illegible] స్వర్గానికి పోవాల్సిన బాటసారులం కనుక మనం పయనిస్తోంది స్వర్గమార్గమో, కాదో మనం తెలిసికోవడం మహా [illegible] "ఏదో ఓ మార్గం పోనిద్దూ" అంటూ సర్దుకొంటుంటే, అని మహా ప్రమాదం, ఎంచేతనంటే అలా సర్దుకొని అనుకూలంగా ఉన్న ఏదో ఓ బాటలో కాలుపడితే, మళ్ళీ అంతలోని అది అంతమై, నీ అంతరంగంలో అశాంతి, [illegible] సృష్టిస్తే— అటు గమ్యమూ చేరలేక యిటు వచ్చిన త్రోవ కానలేక అడవిలోనే, అజ్ఞాన అంధకారంలోనే గిరగిరా బొంగరంలా తిరుగుతుంటావు, బాటతెలియని బాటసారులమవుతాం.

అందుకే ఓ బాటసారి! ఈ మాట విను ఓసారి "స్వర్గానికి బాటను నేనే. ఆమాటకొస్తే, నేనే మార్గం, సత్యం, జీవం" అన్నాడు. మానవుడికోసం స్వర్గానికి రాజబాట వేసిన యేసు దేవుడు. ఆ పరమాత్ముడు యేసుప్రభువు చెప్పిందంతా [illegible] సత్యం అనే విషయంలో ఓ నిర్ధారణకు రావాలంటే ఆయన ప్రబోధాలను నిష్పాక్షికంగా, నిస్వార్థంగా, నిర్మలమనసుతో న్యాయబుద్ధితో పరిశీలించు. ఆయన దివ్యస్వరం ఆలకించు. అనంత సంతోషం అనుభవించు.

—ప్రతాప్

**ఉచితం!** **ఉచితం!!**

దేవుని శాశ్వత ప్రేమను తెలిసికొని నిత్యజీవనను పొందకోరేవారు నేడే మాకు వ్రాయండి. మీకు ఉచితంగా 300 పేజీలుగల చక్కని పుస్తకంను మా తపాలా ఖర్చులతో పంపగలం

## ఎ. యం. జి.

పోస్ట్ బాక్స్ నెం. 1820, హైదరాబాదు–500020 (ఆం.ప్ర.)

# కంచే చేను మేస్తే!





"పండక్కి మీనాన్న వాచీకొనిపెడతాడను కున్నాను" భార్యవైపు చూస్తూ అన్నాడు రామచంద్ర.

"మా నాన్నకు అంత తాహతులేదు. ఆ సంగతి తెలిసికూడా ఆశలు పెంచుకోవటం అవివేకం." ఖచ్చితంగా అన్నది శ్రీలక్ష్మి.

"ఇందులో ఆశేమున్నది? కొత్తఅల్లుడు మామగారి నుంచి ఈ చిన్న కోరిక తీర్చుకో వాలనుకోవటం తప్పేమీకాదే?"

"కోరికలకు చిన్నా, పెద్దా ఏమిటి? ఇవ్వగలశక్తి వుంటే ఎంత పెద్ద బహుమతు లైనా ఇవ్వవచ్చు. పండక్కు పిల్చినా, పెళ్ళికి పిల్చినా, పప్పు, అన్నంతప్ప మానాన్న ఇంకేమీ పెట్టలేదు." అంటూ వంట ఇంట్లోకి వెళ్ళింది శ్రీలక్ష్మి.

తీరని కోరికని కోపంగా మార్చుకుని, వీధిగేటు ధడాల్నవేసి, రోడ్డెక్కాడు రామచంద్ర.

ఆరోడ్డుమీద పదిబారలు పోయి మలుపు తిరిగితే, మెయిన్‌రోడ్డు వస్తుంది.

మెయిన్‌రోడ్డుమీద నడుస్తున్న రామచంద్ర ఆలోచనలతో సతమతమవుతూ, సడన్‌బ్రేకు వేసినట్లు తక్కున ఆగిపోయాడు. క్షణకాలం ఆశ్చర్యపోయినా, తన కళ్లను తనే నమ్మలేకపోతున్నాడు.

కానీ...

మొన్న అత్తవారింటికి పండక్కి వెళ్లే రోజు ఈ షాపు ఇక్కడలేదు. ఇక్కడేకాదు ఈ వూళ్లో ఎక్కడాలేదు. ఇదివరకు గడియారం కొనుక్కోవాలంటే పక్కనున్న పట్నం వెళ్ళి కొనుక్కోవలసి వచ్చేది. మరిప్పుడు? తనింటికి పదిబారల్లో గడియారాల షాపు వుంది.

"ఎక్కడికోవెళ్ళి కొనుక్కోవాలంటే కుదరదుగాని, అతి సమీపంలో వున్న గడియారాల షాపులో గడియారం కొనుక్కోవటం ఎంత 'సేపు' అనుకున్నాడు. కాని వెంటనే స్ఫురణకు వచ్చింది. తనకు వచ్చే జీతం అన్నానికి, బట్టలకు మాత్రమే సరిపోతుందన్నసంగతి. ఈసారి తనమీద తనకే కోపం వచ్చిందిగాని, వెంటనే తండ్రిమీదకు మళ్ళింది. చదువు, సంధ్యలు, ఆస్తిపాస్తులు ఇవ్వలేదు గాని నిజాయితీగా బ్రతకడం మాత్రంనేర్పాడు ముసలాయన. తన రోజుల్లో గనక నీతికి, నియమానికి విలువ వుండేది. ఈ రోజుల్లో... తనతోపాటు గుమాస్తాగిరి చేస్తున్నవాళ్ళు గడియారాలు,

బట్టలు వంటి చిన్నచిన్న వస్తువులేకాదు— స్థలాలు, పొలాలే కొంటున్నారు, మరి తనో...

ఉద్యోగంలో చేరిన కొత్తలో ఆదర్శాలు, కట్టుబాట్లు అంటూ అన్యాయాలకు దూరంగా వున్నాడు. మొదట్లో కొంతమంది ఆ ప్రస్తావన తీసుకు వచ్చినా తను వాళ్ళను చివాట్లు వేసి పంపించాడు. తరువాత ఎవరూ ఏ పనిమీదా తనదగ్గరకు రాలేదు. ఉద్యోగంలో చేరి అయిదారేళ్ళయినా, ప్రమోషనులేదు సరికదా ఇంక్రిమెంటు కూడాలేదు. ఛీ... ఛీ... వెధవ బ్రతుకు... అసలు భగవంతుడికే బుద్ధిలేదు. డబ్బులేని వాళ్ళందర్నీ ఒక కులంలో పుట్టించకూడదూ?... దేవుడికి కులాలు, మతాలు ఏమిటి? అవన్నీ మానవులు ఏర్పరచుకున్న వుక్కు గోడలు.ముళ్లకంచెలు'' ఆలోచిస్తూ నడుస్తున్న రామచంద్ర కాలికేదో తగలటంతో కిందికి చూశాడు. ఎర్రటి పొడుగాటి గడియారపు పెట్టె. అటు ఇటు చూసి, క్షణం తటపటాయించి, చేతిలోకి తీసుకున్నాడు. గుండె దిటవు చేసుకుని పెట్టె తెరచి చూశాడు. కళ్ళు జిగేల్ మన్నాయ్. పెట్టెలోవున్న కొత్త గడియారం తళతళా మెరుస్తున్నది. మనసులో మెరుపు లాంటి ఆలోచన వచ్చింది. కానీ వెంటనే ఆ గడియారపు పెట్టె జేబులో పెట్టుకుని భయం భయంగా రెండడుగులు వేశాడు. వంటిమీద తేళ్లూ జెర్రులూ పాకుతున్నట్లుంది. మొయ్యలేని బరువేదో మీదపడ్డట్లనిపించి, నడుస్తున్న రోడ్డుదిగి, సందు మలుపు తిరిగి తిన్నగా పోలీసుస్టేషనుకువెళ్ళి, "ఆ గడియారం తనకు రోడ్డుమీద దొరికిందని, పేపర్లో ప్రకటించి పోగొట్టుకున్న వ్యక్తికి ఆ గడియారం అందజెయ్య''మని అక్కడ డ్యూటీలోవున్న కానిస్టేబులుకి చెప్పి, గడియారపు పెట్టె జాగ్రత్తగా టేబులుమీద పెట్టి, తేలిగ్గా గాలి పీల్చుకుని, బయటకు వచ్చాడు రామచంద్ర.

అక్కడున్న కానిస్టేబులు రామచంద్రాన్ని కనీసం కూర్చోమని అన్నా అనలేదు సరికదా, ఓ పిచ్చివాణ్ని చూసినట్లు చూశాడు.

మంచునే ఓపికలేక "మరి నేవెళ్లొస్తా!'' అంటూ రోడ్డెక్కాడు.

* * *

పండక్కురమ్మని మామగారు రాసిన ఉత్తరం చూసుకుని ఉత్సాహంగా ప్రయాణమైనాడు రామచంద్ర అత్తవారింటికి.

పండగ రద్దీ అంతా బస్సుస్టాండులోనే వున్నట్లుంది. దిగేవాళ్ళను దిగనివ్వకుండానే, బస్సెక్కటానికి కుస్తీపడుతున్నారు జనం. బస్సులు వచ్చీరాకముందే ఈగల్లా ముసురుతున్నారు. అంతరద్దీలోనూ తోసుకుని, తొక్కుకుని బస్సెక్కాడు రామచంద్ర. అనుకోకుండా దొరికిన మంచి సీట్లో ఏమాత్రం ఆలస్యం చెయ్యకుండా కూర్చుని విజయగర్వంతో నాలుగువైపులా చూశాడు. ఆ చూపు అతనిపక్కన కూర్చున్న ఆధునిక యువకుడి అందమైన చేతిగడియారం మీద పడ్డది. కళ్ళు చికిలించి చూశాడు. అదే ... అదే...కళ్ళు గట్టిగా మూసుకుని తెరిచి మరీ చూశాడు. అదే...

రామచంద్రకు ఆలోచన్లు తెగటంలేదు. కాసేపటికి తేరుకుని పక్కమనిషిని మాటల్లోకి దింపాడు.

"మీ గడియారం చాలా బాగుంది. ఎక్కడ కొన్నారు?'' అంటూ.

"ఇది నేను కొనలేదు. అత్తవారిచ్చిన పండగ బహుమతి'' గర్వంగా చెప్పాడతను.

"అలాగా! చాలా బాగుంది. మీ అత్తవారిది ఏవూరు?''

"ఈవూరే! మా మామగారు కానిస్టేబులుగా పని చేస్తున్నారు.''

రామచంద్రకు చెంపమీద ఛెళ్ళున కొట్టినట్లనిపించింది ఆ మాటతో. మాట్లాడలేదు గాని మనస్సు సాగరతరంగమైంది. మంచితనానికి విలువలేని సమాజంమీద పగ, ద్వేషం అలలు అలలుగా లేచాయి. దేన్నయినా తనలో ఇముడ్చుకోగలిగిన సముద్రుడిలా రామచంద్ర పెదవి కదపలేదు.

అన్యమనస్కంగా అత్తవారింటికి చేరిన అతడికి ఎప్పటికంటె ఎక్కువ మర్యాదలు జరిగినా అక్కడివారి మనసుల్లో ఏదో బాధ పసిగట్టిన రామచంద్ర వుండబుద్ధికాక మర్నాడే తిరుగు ప్రయాణమయినాడు. ఎంత బతిమిలాడినా, "అర్జంటు పని ఉంది. వెళ్ళి తీరాలి'' అని పట్టుబట్టిన అల్లుడి చేతిలో కొత్తబట్టలు పెడుతూ, 'నీకోరిక తీర్చలేకపోయాం. ఏమీ అనుకోకు రామచంద్రా' అన్నాడు బాధగా మామగారు.

"ఎంత పాపిష్టివేళ కొన్నారో ... ఇంటికన్నా తీసుకురాలేదు'' కళ్ళు వత్తుకుంది అత్తగారు.

"నా మొదటినెల జీతంతో మీకు గడియారం కొనిద్దామని...'' స్వగతంలాఅన్నాడు బావమరిది.

ఈ మాటలేవీ అర్థంకాని రామచంద్ర భార్యవంక అయోమయంగా చూశాడు.

"నాన్న ఎంతగా అనుకున్నా కొనివ్వలేని గడియారాని, మా అన్నయ్య తన మొదటినెల జీతంతో కొనిద్దామని డబ్బిచ్చాడు. ఆ డబ్బు తీసుకుని మనవూరువచ్చి, గడియారం కొని మనింటికి వస్తుంటే దారిలో...'' శ్రీలక్ష్మి మాట పూర్తిచెయ్యకుండానే "ఎర్రనిపెట్టె. ఎంతో బాగుందిట.'' అత్తగారి మాటవిన్న రామచంద్రానికి మరణించిన మంచితనం మరింకేం చెయ్యగలదనిపించింది.



# ఉత్తరాలు

## కవితలు

నేను మన ఆంధ్ర సచిత్ర వారపత్రికను షుమారుగా 30 సం. రాల నుంచి చదువుతున్నాను. 14.11.80 దీపావళి పత్రికలోని అంశాలు చదివాక ఈ ఉత్తరం వ్రాయకుండా ఉండలేక పోతున్నాను.

సామాన్యుని సణుగుడు లో వ్రాసిన కవిత, శ్రీసత్యశ్రీ మరియు తేజస్విత వ్రాసిన రాబోకు దీపావళి మరియు దీపాలు కవితలు ఆంధ్రసచిత్ర వార పత్రికకు హైలైట్స్.

ద్వాదశి రఘురామప్రసాద్ [పూనే]

## సామాన్యుని సణుగుడు

14.11.80 [దీపావళి] సంచిక చదివాను. సర్వాంగసుందరంగా అలంకరించారు. ఈసారి కార్టూన్లు ఊహించనంత ఎక్కువగా వేశారు. థాంక్స్.

ముఖ్యంగా [దీపాలెవడెట్టు గలడు?], సామాన్యుడి సణుగుడు కవితా రూపంలో చాలా హృద్యంగా వుంది. విషయాన్ని వ్యంగ్యాత్మకంగా చిత్రించడంలో పిరాజీగారు చతురులు.

మటికాన ప్రకాష్ [విజయనగరం]

## సీరియల్స్

21—11—80 నాటి పత్రిక చదివాను. 'స్పందన' సీరియల్ ఒక రకమయిన ప్రత్యేకత సంతరించుకొని సాగిపోతూంది. మంచి సీరియల్ అని అనకుండా ఉండలేం. చిన్న పిల్లల మనస్సులు బాగా చిత్రిస్తున్నారు రచయిత.

మటికాన ప్రకాష్ [విజయనగరం]

* * *

సీరియల్స్ రెండూ స్పందన, ప్రేమతీర్థం ఆసక్తిజనకంగా ముందుకు సాగుతున్నాయి. ఈ వారం కార్టూన్స్ అన్నీ కడుపుబ్బ నవ్వించాయి. కవితలు మమ్మల్ని అలరించాయి.

వై. హేమ సుందరరావు, హేమబిందు [డోర్నకల్]

* * *

ఈ ఉత్తరం రాయడానికి కారణం— స్పందన సీరియల్ గత రెండు వారాల నుంచి హృదయాన్ని కదలించి వేస్తున్నది. పేరుకు తగినట్టుగానే వుంది సీరియల్. నా హృదయాన్ని సున్నితంగా తట్టి కాని స్పందింప చేస్తున్న రచయితగారికి అభినందనలు. ఇలా విభిన్నంగా కన్పించే నవలల్ని సీరియల్‌గా వేయండి

ఐద్వేలి రమేష్ [అనంతపురం]

Printed and Published by S Nageswara Rao at the Andhra Patrika Press, Mallikarjuna Rao Street Gandhinagar, Vijayawada-3. Editor : S. Radhakrishna.